ఆయా ధర్మములను క్రమముగాఁ బలుకుటయందు యథాసంఖ్యమను నలంకారమును గలదు.

**కామినీ జనులు :** యోగిజనములతోఁ బోల్చుచు కామినీ జనులను వర్ణించుటయు శ్లేషాధారముగ గావించియున్నాఁడు కవీంద్రుఁడు.

పరిచిత బంధనైపుణి, నపార కళానుభవప్రసక్తి, నా
దరస వివేకస పద సదాశుకవాక్య సుధానుభూతి మో
హరహిత వృత్తిఁ బ్రస్ఫుర దనంగరహస్య విచారబుద్ధి న
ప్పురమునఁ గామినీజనులు పోల్తురు యోగి జనంబు పోలికన్ [1]

ఇందలి శ్లేష అభంగమయినది. బంధ, కళ, నాద, శుక, మోహ, అనంగ శబ్దములచే కామినీ జనులకు యోగిజనులకు నభేదప్రతిపత్తిచే నుపమానము పలికెను.

**ఏనుఁగులు :** ఆ పురమందలి యేనుఁగులు అవధూతలతోఁ బోల్పబడినవి.

అరగంటం గనుగొంట, మందగతిఁ బూర్ణాహంకృతం, బ్రార్థనా
కరభుక్తిస్థితి, ముక్తలోక భయశంకావృత్తి నున్మత్తన
వ్యరతి, స్సత్వసమగ్రత, స్మృదిత పద్మాభ్యున్నతి, స్కంధ మం
ధర దంతావళకోటి యొప్పు నవధూత ప్రక్రియం దత్పురిన్. [2]

అవధూత స్వభావము గంధగజేంద్రస్వభావముతో సరిపోల్పఁబడినది.

**గుఱ్ఱములు :** గుఱ్ఱముల వేగము మనోవేగమును గూడ మించినదను నర్థమున నా పురమందలి మానవులు తమ మనోచాంచల్యమును కోల్పోయి స్థిరత్వము నందినవారుగ నివారు నిశ్చలులై మోక్షసౌఖ్యమునుఁ బొందగల్గుచున్నారని తెలుపుటయైనది. గుఱ్ఱముల వేగమును గెలువలేమని మానవుల మనస్సులు చంచలత్వమును మానుకొనెననుట యిందలి చమత్కారము.

---

1. శ్రీ.కా.మా. 1 ఆ — 24ప.
2. శ్రీ.కా.మా. 1ఆ - 25ప.

ఆ పురి తేజుల వేగ
వ్యాపారము గెలువనోప మను సిబ్బితిఁబో
చాపలవిరహిత సౌఖ్యం
బాపాదించుకొను మానవావళి మనముల్.*

పైన పేర్కొనిన విధముగా పేనుఁగులు, గుఱ్ఱములను వర్ణించుట పట్లను కవి ధూర్జటి అవధూతను, మోక్షార్థులయిన వారి నిశ్చలతత్వమును బోల్చుట చూడ, పురవర్ణన యందన్ని యెడలను తనకుగల శివపారమ్యమును, ఆధ్యాత్మిక తత్వమును వెలార్చెనాఁడని తెలియఁగలము.

ప్రబంధసామాన్యమగు పురవర్ణనమునకు, ధూర్జటి కావించిన పురవర్ణనమునకు గల వ్యత్యాసమును, ధూర్జటి విశిష్టతను గమనించితిమి

ఆ. మధురాపురవర్ణనము :

మధురానగరము వాలవాయి చొక్కనాథుని నివాసభూమి.

కపట చతుష్షష్టిగతుల నాడిన వాల
వాయిచొక్కేశు నివాసభూమి
యతని పట్టపుదేవియైన మీనేక్షణా
ధరతనూభవకుఁ బ్రధానగృహము
ద్రవిడభాషావీతతల శంఖఫలకంబు
గల కనకాబ్జపుష్కరిణి కిరవు
దక్షిణాంబుధి వధూతామ్రపర్ణీనది
సవతు వైఖను నెన్నఁజాలు నుసికి

---

* శ్రీ.కా.మా. 1అ_25ప.

నిజదృగబ్జ ప్రపూజిత నీలకంఠ
కూడలళఘయ వైకుంఠ కుఠితౌఘ
నిఖిల సంపత్పరంపరా నిహిత కింప
చాన తాపంబు మధురాభిధానపురంబు.*

శ్రీకాళహస్తి మాహాత్మ్యమువలె నిచట పురవర్ణనము జరుగకున్నను విశేషమొకటిగలదు. ఈ పురవర్ణనము చేసిన పద్యమందలి యంశములన్నియు కథా సందర్భములను సన్నివేశములను సూచించునవియై సాభిప్రాయములగుచునే ప్రయుక్తమైనట్లు గ్రహింపగలము.

ఇది తృతీయాశ్వాసమునందలి రెండవభాగము. ఇందు నత్కీరుని కథరానున్నది. దాని యా యితివృత్త సంఘటనములను సూచించు విశేషములే యిచ్చట ప్రయోగింపఁబడినవి.

1. బ్రాహ్మణరూపమున బ్రాహ్మణుని రక్షించుటకునై పాండ్యుని కొలువు కూటమునకుఁబోవుట, నత్కీరునితో వాదులాడుట, శపించుటయు సుందరేశుని(చొక్కనాథుని) అరువదినాలుగు లీలలలో నొకదానిని మొదటిపాద భావముద్వారాని సూచించుచున్నది.

2. పట్టపుదేవి మీనాక్షి ప్రస్తావనము కూడ నట్టిదే. నత్కీరునితో వాదమునకుఁ బూను బ్రాహ్మణునకు చెప్పిపంపినట్టి పద్యము యొక్క భావము, నత్కీరుఁడు ప్రశ్నింప పరమేశ్వరుఁడంగీకరించినట్టియు నైన గిరితనయా కచభారంబు సహజగంధంబను ప్రసక్తియు నిట్టిదే. ఆ వర్ణనమే నత్కీరుని కథ కాయువు పట్టనఁదగినది.

3. కంఠఫలకము : 'వివిధవన్న్యప్రాయవాగ్గుంభ సంపత్కావ్యప్రతిపాదక ప్రతిభులగు నత్కీరాది కవీంద్రులకు సంఘమెండుగురకు నిలయమైన పీఠమునా బలుకఁబడనున్నది.

4. కనకాబ్జపుష్కరిణి . నత్కీరుఁడు తీర్థయాత్రలో గాంచిన సరస్సును, కుమారస్వామి నత్కీరుని ఋనుకవేయుమని పలికిన నెత్తుటి కాలనును స్ఫురింపఁజేయును.

* శ్రీ.కా.మా 3ఆ—131 ప.

5. నదుల ప్రసంగము :— తామ్రపర్ణి, వైఘలను నదులను పలుకుటచే సత్కీరుఁడు కావింపఁబోవు తీర్థయాత్ర, అందున కావేరి, గంగ, పెన్న, గుండ్లకమ్మ, కృష్ణవేణి గౌతమీగంగ, మున్నగు నదుల నవగాహమొనర్ప నున్నాఁడను నంశమును సూచించుట యైనది.

6. దృగబ్జపరిపూజితనీలకంఠ :— ఈ ప్రసక్తిచే ధూర్జటి మూఁడు విశేషములు దెలిపినట్లగుచున్నది. నిటలాక్షుఁడని తెలిపి సత్కీరుని భయపఱచుటయు, నిటలనేత్రుఁడయినను భయపడని నత్కీరుఁడు శప్తుఁడగుటయు సూచించుటయొకటి. ఆశ్వాసాద్యంతములందు గత, అనాగత కథాంశములను సూచించునట్లు తృతీయాశ్వాసమున మొదటి భాగమున చెప్పిన కన్నప్ప కన్నిచ్చిన వృత్తమును గుర్తుచేయుట రెండవది. ఇఁక విష్ణుఁడు కన్నర్పించి శివుని మెప్పించుటయును నంశమును బలుకుటచే శివాతిశాయిత్వము బలుకుట మూఁడవది.

౯. వేశ్యాతనయుల కథలోని మధురాపురము :—

ఇందలి మధురాపురమున నివసించు వారు మీనాక్షీ సుందరేశ్వరులే. ఇచ్చట పుర వర్ణనము ప్రబంధసామాన్యముగా రాజుల పరాక్రమము, కోటగోడల ఔన్నత్యము, అగడితల లోతుపాతులు, సౌధముల కాంతులు వర్ణింపఁబడినవి.

రాజులు వీర ఘోరాజులలో వల
రాజు తొడురు జియరతికి ననఁగ ...[1]

సర్వము లక్ష్మీనిలయములై పిండిల్లుచున్నవట

శ్రీనగజాత్మకికిన్ జననసింధువు, తత్పరి బొమ్మగింట్లు నా
నావసథంబు, లాత్మసఖు లంబుజలోచన, లాటపట్లు, ధా
త్రీవరమార్గముల్ రథ హరిద్విరదాదులు బొమ్మ, లాడు ని
చ్చావచనావళుల్ నిగమశాస్త్రములై విలసిల్లు నెప్పుడున్.[2]

1. శ్రీ.కా.మా. 4ఆ - 3ప.
2. శ్రీ.కా.మా. 1ఆ - 4ప.

ఆ పురమందలి యిండ్లు, స్త్రీలు, రాచబాటలు, రథ, గజాశ్వాదులు, శాస్త్రములు, అన్నియు లక్ష్మీనిలయములే యనుటచే నీ పురము సకల సంపత్సమేతమేనని పల్కుటది. తరువాతి పద్యమున ధూర్జటి కథా సందర్భమును సూచించుచున్నాడు.

ధరణికిఁ గంఠ భూషణము తన్నగరంబు, తదీయమస్తకా
భరణము పార్థివాన్వయము ప్రాణము దానికి రాజనందనో
త్కరము, తదాత్మకున్ మదనదాహరసప్రదవైశ్య వీథి, త
త్సరసిజలోచనల్ గుఱుతు చక్కదనంబు వారిలోపలన్.[1]

ఇందలి యంశములొకదాని కంటె నొకటి యుదాత్తము, ఉత్కృష్టమనని వర్ణింపబడినది. ఆ పురమే భూమికి కంఠభూషణముకాగా, దానికి తలమానికమైనది అందలి రాజవంశము. ఆ రాజవంశమునకు రాజనందనులు ప్రాణమువంటివారు. వారికి గలుగు మదన తాపమును పోగొట్టజాలిన వారా నగరమందలి వేశ్యాజనము. అనగా అంతటి ప్రాముఖ్యము కలిగిన వేశ్యలయొక్క, అంతటి అందగత్తెలయిన వేశ్యలయు వాసస్థానమైన యీ పట్టణమున, "ఉలిముట్టని లింగము"లయిన యిరువురు వేశ్యాతనయల "సుకీర్తి వధూభుజంగుడే" తమకు భుజంగుడని వేశ్యాధర్మమురోసిన వారి కథ చెప్పబడనున్నది కాన పురవర్ణనమున వేశ్యలకంటె ప్రాముఖ్యమిచ్చుట సంభవించిన దనదగియున్నది.

ఈ విధముగా ధూర్జటి తన ప్రబంధమును మూడు తావులందు పురవర్ణనము గావించియున్నాడు. మధురాపురవర్ణనమున్న రెండుతావులయందు నాతని కథన చాతురి,వర్ణననైపుణి మెఱయుచుండగా, మొదటి శ్రీకాళహస్తి పురవర్ణనమున కవి ధూర్జటి కవిత్వము, వ్యక్తిత్వము, రెండు నొకదానిలో నొకటి కలిసిపోయి, ఒకదాని కొకటి బలమై వెలసినదని చెప్పనొప్పును.

మధురాపురవర్ణనము రాయల ఆముక్తమాల్యద,[2] జక్కన విక్రమార్కచరిత్ర[3] ఘటిసేపుల నాగయామాత్యుని దశావతారచరిత్ర[4]ల యందును గలదు. జక్కన 44

1. శ్రీ.కా.మా. 4ఆ - 5ప.
2. ఆ.మా. 2ఆ - 3ప.
3. వి.చ. 1ఆ
4. ద.చ. 9ఆ

పద్యములందు వర్ణించుచున్నాఁడు, ఆ పూర్ణవర్ణనము లేవియు ధూర్జటి పురవర్ణనము వలె విశిష్టమైనవికావు. ప్రథమంథసామాన్యముగనున్నవి. ధూర్జటి భావించిన రెండు చాపులయందలి మధురాపురవర్ణనము కథాసందర్భమున కనురూపముగ, పూర్వరంగ ప్రక్రియగ, దివ్యముగా నున్నది. కథలో ఒక అంగముగా, ప్రవేశికగా నలరారినది మధురాపురవర్ణనము,

## 2. శైలవర్ణనము :-

'శ్రీకాళహస్తి మాహాత్మ్యము'న శైలవర్ణనము మూఁడు చోటుల గాన్పించును, అందు దక్షిణకైలాసమను 'జముదెనకొండ', భైరవాద్రి, ఉత్తరకైలాసనగములు వర్ణింపఁబడినవి.

**దక్షిణకైలాసనగము :-** ఇది యిందు జముదెనకొండ, శమనాళాద్రియనియు వ్యవహృతమైనది. శ్రీకాళహస్తియందుగల పర్వతములేవే దైవముల కావాసమై వెల సినవో పలుకుచు వానివే నని రక్షితమై యలరారుచుండునని, తొలుతగా పరిచయము చేసెను. ఆ పర్వతము, పార్వతీ పరమేశ్వరులు భూలోకమున కేఁగుచెంచుటచే వారిని విడిచి యుండలేక, పనినుండి భువికేతెంచిన కైలాసమే.

> "కైలాసం బగజేశులఁగొలువ రాఁగా భక్తితో దేవతా
> శైలంబుం జనుదెంచెఁ గూడి ——*

అగజేశువెంట సర్వదేవతావళి భువికేతెంచుట యిది. మేరుపర్వతమును కైలాసాగము ననుసరించెననఁగా, అందుండు దేవతలును వచ్చిరని యర్థము. భూలోకమునకు దిగిన యా కైలాసమే దక్షిణకైలాసమనఁబరగినది. ఆపర్వతమునకు సుత్తరభాగమున మేరుపు నిలిచినది. ఆమేరువునకు భైరవ, దుర్గ, నాగ పర్వతములు పరివేష్టించి యున్నవి.

ఆ దక్షిణకైలాస పర్వతప్రాంతమున పార్వతితోఁగూడిన పరమేశ్వరుఁడు నిజ నివాసవైభవోన్నతిని మఱచి విహరించినాఁడట. ఆ జముదెనకొండ

---

* శ్రీ.కా.మా. 1ఆ - 64ప.

'అణిమాదిప్రదమై, పురాణకథితంబై, మోక్షదంబైనది', [1]

ఆ కొండపై అలరుందీగలు, పువ్వుగుత్తులు, కురంగములు, పల్లవంబులు, పంచాననములు, మధుకరములు, బింబములు, దాడిమీఫలములున్నవి. అప్పుడు పరమేశ్వరుఁడు గిరిజాసహాయుఁడై, సంయమిగా, కిరాతసంచారియై, సిద్ధగృహస్థుడై రతినాథుఁడై, అన్నిదెసల దనియగురీతి బహువేషధారియై, విహరించుచుండెను. ఆ గిరికి నాలుగు దెసల నామడదూరములోపల మృతి చెందువారికి మోక్షములభించును. అసుర మనుష్య, దైత్య, భుజగాదులా గిరీంద్రముపై 'అఖండ సౌఖ్యదసదాయకమైన శివాగమ ప్రభావము' తమకు సరివచ్చెనా యన్నట్లు తిరుగుచుందురు.

ఈ పర్వత మాహాత్మ్యము నుగ్గడించిన తీరు పరమాశ్చర్యకరము.

"జడలు ధరింప, రంగజుని జంపరు, పూయరు బూదిపూఁత మై
నడుగరు భిక్ష, కట్టరజినాంబరము, ల్చరియింపఁబోరు పే
రడవుల, నగ్గిరీంద్ర మహిమాతిశయం బిఁక నేమి సెప్పుదున్ !
బడయుదు రూరకుండియును ప్రాణులు చిత్రముగా శివత్వమున్"[2]

జడలుధరించుట, అంగజుని చంపుట, బూదిపూఁత మైపలఁదుకొనుట, భిక్షమడుగుట, అజినాంబరములు గట్టుట, పేరడవులఁజరియించుటలు శివుని స్వరూపస్వభావములు. ఇవి యేవియు నాచరింపకయే యా గిరీంద్రమున వసించు ప్రాణులు శివసామ్యమును పొందుట విచిత్రముగదా! కార్యసాధనకు వలయు కారణములు, సాధనములు లేకయే కార్యము సాధించినట్లు పలుకుట విభావనాలంకారము. కేవల మా కొండయందుండుట చేతనే యిట్టి "శివత్వ" మందుట, యా గిరీంద్రమహిమాతిశయము. దానినెంతని, యెట్లని వర్ణింపశక్యమగును? కాదు. అంతియేకాదు, ఆ గిరిపై ప్రసరించు వాయువులు, 'భవదావాగ్నివిదాహమును' చల్లార్చును.

1. శ్రీ.కా.మా. 1ఆ – 87వ.
2. శ్రీ కా.మా. 1ఆ – 103వ.

లోపాముద్రతోఁగూడి యగస్త్యుఁడు గాంచిన యీ దక్షిణకైలాస వర్ణనము అంత్యానుప్రాసాలంకారాలంకృతమై యలరుచున్నది.

ప్రణుతుల్సేయుచుఁగాంచెఁ గుంభజుఁడు లోపాముద్రతోఁగూడి ద
క్షిణకైలాసము, సంబికా హరికృత శ్రీపాదుకాన్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్, భవమహామాయా విపర్యాసమున్
గణనాతీత నటీవిలాసము, సమగ్రశ్రీ సముల్లాసమున్.*

ధూర్జటి కవీంద్రుని శైలివిన్యాసమునకు గుర్తింపఁదగిన పద్యమిది. పర్వతవర్ణనమున మిగిలిన విశేషణముల కంటె 'భవమహామాయా విపర్యాసమున్' అనునది కవి భవపరాఙ్ముఖతను సూచించునది. ఈ కైలాసనగ వర్ణనము మఱియు కాళము పూర్వజన్మ కథనమునఁ గననగును. పరమేశ్వరు నలంకారములలో నొకఁడగు కాళుఁడు, కైలాసము నందలి కాలకంఠుసేవకు జాగుసేయుటను వర్ణింపఁబడిన కైలాసవర్ణము గలదు.

గంధర్వకామినీ గానంబు విని తల
  లెత్తి యాడెడి భుజగేంద్రములును
భుజగఫణారత్నములు దీధితులఁ బ్రకా
  శించు తమస్సమాశ్లిష్టగుహలు
గుహలఁ బ్రతిధ్వనుల్ ఘుమఘుమయనఁ బొంగు
  నిర్మలోదకముల నిర్ఝరములు
నిర్ఝర తటముల నిరుపాధిక సమాధి
  యోగనిద్రారతినుండు మునులు

* శ్రీ.కా.మా. 1అ - 109ప.

మునులు తపములు నిర్విఘ్నముగ ఫలింప
భక్తి రక్షించుకొనివచ్చు ప్రమథగణము
ప్రమథగణ భామినీయుత పార్వతీ వి
లాసములు గల్గి తనరు కైలాసనగము.*

సందర్భౌచిత్యముగల వర్ణనమిది. భుజగేంద్రమగు కాళము పూర్వజ న్మవృత్త కథనము భుజగేంద్రములతో ప్రారంభించుట యెంతయు సముచితముగా నున్నది. పడగవిప్పిన పాముల దైర్ఘ్యమును సూచించుటకోయన్నట్లు, పద్యము ముక్తపదగ్రహస్తముతో సాగినది. ఆ యా వాని గుణములు, స్వభావములు సహజసుందరములై స్వభావోక్తి సుభగములై యలరుచున్నవి. 'గానరసంఫణి' యన్నట్లు పాటకు పాములు పడగెత్తి ఆడుటలు, పాముల తలల నుండు మణులకాంతులచే అంధకారబంధురములగు కొండగుహలు ప్రకాశవంతము లగుట, గుహల నొరసికొనుచు పాఱు సెలయేఱుల గలగలధ్వనులు ప్రతిధ్వనించుట, ఆ నిర్మలోదకముల తీరమున నిశ్చలమైన తపస్సమాధి యందు మునులు లుండుట, వారి తపములు నిర్విఘ్నములుగ కొనసాగుటకు ప్రమథులు రక్షణసేయుట, వారి స్త్రీలతో గూడిన పార్వతి విలాసములతో గూడియుండుటలా కొండ పై గల విశేషములు.

ఇచ్చట గావించిన కైలాసనగ వర్ణనము కవి తృప్తితీర గావించినట్టిది. ఇది ఉత్తర కైలాసరజతగిరి.ఆ వాతావరణమంతయు నెంత శుభ్రమైనదియో,శుక్లమైనదియో తెలుపుటకో యనునట్లు తరువాతి పద్యము పలుకబడినది. వేశ్యాతనయలు దక్షిణ కైలాస విభు దర్శనముఁగోరి యాత్రచేయుచున్నప్పుడు త్రోవలో భైరవునిలయమగు భైరవాద్రివర్ణనము జరిగినది. అది అద్భుతావహము. ఆ కొండ పుట్టుకయే ఒక అద్భుతము. నిలిచిపోయిన శంకరుని మెలికిడీయుటకు, సరోవరమును పూడ్చుటకై, వాలి తెచ్చివేసిన కొండయది. భైరవాస్పదమగు నా కొండపై నుమతో సర్వేశ్వరుండు చరించుచుండునట.

* శ్రీకా.మా. 4ఆ – 152ప.

ఫణిపతిహార భానఘనభస్మ సుధాకర భూషితాళికే
క్షణ ధవళప్రభా కలిత సానుచర ద్వృషభాధిపున్ ఖణేల్
ఖణిలున అంకెవేయ కెఱుఁగన్నమకూడదు, చూడ నన్నగా
గణిత గుచిప్రసారము జగత్త్రియగాహకమై వెలుఁగగన్.[1]

తెల్లని సర్పములను దాల్చి, మస్మధురిదేహాపు భస్మమును, అమృత కిరణుఁడైన చంద్రుని ధరించిన, శివుని తెల్లని శరీరకాంతిలో మునిఁగిన ఆ కొండచరియ యందు తిరిగెడు శివుని వాహనమైన తెల్లని యెద్దు గుర్తింపబడుట కష్టమయ్యెను. ఖణిల్లని అంకెవేసిననేకాని దానిని గుర్తింపలేము. ఇది ఉన్మీలితాలంకారము. కొండతెలుపుదనము నతిశయముగాఁజేసిపలుకుటచే నతిశయోక్తియుఁ గలదు.

ఆ కొండయందు వసించు పశుపక్ష్యాదులు సైతము శివుదారగింపక, తమ తమ యాహారములు ముట్టుకొనవు, ఇతరములను తాకనియవనుట, వాని వాని శివభక్తి తాత్పర్య వైశిష్ట్యమును వెల్లడించుటయే.

ఫలములఁగాచు నద్రిసుత పాణి శుకంబు, వృషభంబుఁగాచు శా
ద్వలములఁ గాచు దంతిముఖవాహన మత్తుతరాజిఁ, గాచు జో
గుల యిలువేల్ప వాజి, మదిఁగోరక బోనము, భక్తులీశ్వరుం
గొలిచినదాకఁ దత్కుధరకూట గళత్తటినీ తటంబులన్.[2]

పరమేశ్వరుఁడారగింపనిదే పార్వతిచేతిలోని పెంపుడు చిలుక వృక్షఫలములను తినదు, వృషభము పచ్చికమేయదు, ఎలుక అక్షతలను తినదు, కుక్క అన్నము ముట్టదు, అంతియేకాక అవి, ఆ యా పదార్థములను (ఫలాదులను) ఇతర జంతువులను సైతము

1. శ్రీ.కా.మా. 4ఆ 153ప.

2. శ్రీ.కా.మా. 1ఆ – 154ప.

పుట్టుకొనని యక్షరక్షనాగాదులుండునట్టి కైలాసనగమాహాత్మ్యము నుగ్గడించుచు నీ వర్ణనమును దలపించునదియే తెనాలి రామలింగని ఘటికాచల మాహాత్మ్య మందలి ఋష్యాశ్రమ వర్ణనము.

మొకరి తేఁటులు మూతిముట్టవు తేనె నుల్
 శ్రీ మధుశాసి కర్పించి కాని
కోకిలమ్ములు చివురాకులు గొఱుకవు
 శ్రీ వనమాలి కర్పించి కాని
లేఁబచ్చికల్ కబళింపవు హరిణముల్
 శ్రీ నీలమూర్తి కర్పించి కాని
ఫలభుజిక్రియలకు జిలుకలు తలఁపవు
 శ్రీ మాధవునకు నర్పించి కాని
యితర జంతువులును హరి మతిఁదలంచి
కాని యే వర్తనములకుఁబూనవనిన
నా తపోవన మాహాత్మ్య మభినుతింప
నలవియే వేయిమొగంబుల చిలువకైన. [1]

ఆ కొండనుండి ప్రవహించు ఫలరసప్రవాహము సెలయేఱ్ఱందు కలియుచుండగా నీ సంగమమును భ్రాంతిచే మును లా నీటియందు స్నానము లాచరింతురు. [2]

పెండకొండతెలుపును వర్ణించిన తీరుచూడ, కవీంద్రుని యూహాశాలిత విశదమగును.

---

1. ఘ.మా. 1అ - 13ప.
2. శ్రీ.కా.మా. 4అ - 155ప.

పారదరాశి చంచలతఁ బాసి వసించెనొ శైలమై సుధా
నీరధి నిల్చెనో, కుముదినీపతికాంతి ఘనీభవించెనో
నా రజతాద్రి ముక్తలలనామణి కేళి సుధాంశుకాంతి రా
జీరచితోరు సౌధగతిఁజెల్వెసఁగు న్మునిసేవ్య సిద్ధమై[1]

చంచలత్వము గలిగిన పాదరసము, పాలసంద్రము, వెన్నెల, అనునవి గడ్డ కట్టి స్థిరముగా రూపొందినవా యన్నట్లు ఆ వెండికొండ ఉన్నదనుట యిది. ఈ యన్నింటికి మించి యా గిరి ముక్తలలనా కావాసమయిన మేడను చంద్రకాంత శిలలతో కట్టినట్లున్నదనుట ఈ పద్యమందలి విశిష్టతగా మనసు భావింపనగును. పైన జరిగిన పర్వత వర్ణనమున వెండికొండ తెల్లఁదనము, చల్లదనము తియ్యఁదనములు వెల్లడింపఁబడినవి. శివభక్తుల భక్తి తాత్పర్యములు పేర్కొనఁబడినవి. 'ముక్తలలనామణికేళి సుధాంశు కాంతి రాజీరచితోరు సౌధగతిఁజెల్వెసఁగు' ప్రత్యేకముగా పేర్కొనుట కవీంద్రుని మోక్ష దృష్టి వ్యక్తమగుచున్నది. ప్రకృతిరూపమును ఘనరూపముగ మారినట్లు ఉత్ప్రేక్షించుట యె కవీశుని ప్రతిభకు తార్కాణ.

తెలుఁగు సాహిత్యమున పర్వతవర్ణనములు పెక్కు తావులఁ గందుము. అనుప్రాసాలంకారములతో వెలుగొందు వృత్తములును గలవు

కరికలితమంత దంతపరిఖ ద్వీపఖండిత దేవదారువున్
మదనవినోదకందళిత మానసమానసవాస భీరువున్
బదరపదాచ్యుత క్రకచపాటిత లస్త్వక దేశ చారువున్
ముదిత చమూరువున్ ఫలితమూలనమేరువు నా సుమేరువున్.[2]

హేలమెయి న్మహీరమణుఁ డెక్కెను నిశ్చల నమ్ర దేవతా
సాలముఁ గంధరస్థసురచారణ దంపతిగాన వీచి వా

---

1. శ్రీ.కా.మా., 4ఆ - 8ప.
2. నాచనసోమన - ఉత్తరహరివంశము. 2ఆ - 38ప.

చాలముఁ దుంగశృంగ తటసక్తమణీపునరుక్త తారకా
జాలముఁ బారిజాతవన సంస్థితిమూలము హేమశైలమున్

ఈ వర్ణనమంతయు సర్వప్రబంధసామాన్యమే కాని ధూర్జటి కైలాసగిరి వర్ణన మహనీయము.

ఎఱుకు లీ గిరిమీఁద నిచ్చ ద్రిమ్మర నమో
మయసాధనములు హేమంబులగును
శబరులు మృగములఁజంపి యుమ్మల డిగ్గి
వచ్చు నాలో సజీవంబులగును
వ్యాధు లీ కొండపై వన్యాశనంబులు
సేవింపఁగాఁ గాయసిద్ధియగును
జెంచు లీ యద్రి నిద్రించి మేల్కొనువేళఁ
దమపధూటుల తల్పతలములగును
దృశ్యమగు వారికిందు నిధివ్రజంబు
దృశ్యమగుఁగూడి తమ తోడఁదిరుగు జనము
విస్మయముచెప్ప నొక్కొక్కవేళ, దీని
సానుభూముల మహిమాతిశయ విధంబు.*

ఇనుము బంగారమగుట, నిర్జీవములు సజీవములగుట, వన్యము-లయిన పానీని భుజించుటవలన కాయసిద్ధి (వయస్తంభము) కలుగుట, దాలు ప్రియురాండ్ర తల్పతలము లగుట, నిధులు కనుపట్టుచుండుట, విస్మయము కలిగించునుగదా! *

ఏదేని ఒక వింత సంఘటనము నిరతము జరుగదు. ఎల్లప్పుడు జరిగిన అందు విచిత్రము లేదు. ఒక్కొక్కప్పుడట్టి విచిత్రములు కలుగుటయే అద్భుతము. ఈ అభిప్రాయము

* శ్రీ.కా.మా. 4అ - 83ప

తోడనే కవిఁ విస్మయము చెప్పనొక్కొక్కవేళ దీని, సానుభూముల మహిమాతిశయ విధంబు' అని పల్కుట లేకున్న నా కొండయందు వేటాడు ఎఱుక బంగారమగునను నాశచే ఇనుపాయధము తెచ్చుకొనుచుండుట నిత్యము జరుగుచుండును. అట్లే చంపిన మృగములు మరల బ్రతికియుండుటచే వారికి వేట భగ్నమగును అటులనే వన్యాశనములు తిన్నప్పు డంతట కాయసిద్ధిజరుగదు. నిద్రించిన ప్రతిసమయమున సవిప్రియతల్పములు కాజాలవు ఎప్పుడు చూచిన నప్పుడు నిధులు కన్పింపవు. సామాన్యముగా తమతో వచ్చిన జనమెక్క డెక్కడగలరో కనుపెంచుటయు అసాధ్యము. కనుకనే ఇట్టి అసాధ్యములు, అసాధారణము లొక్కొక్కవేళయందే కల్గుచుండు ననినాఁడు కవీశుఁడు.

౩. ఋతువర్ణనములు :- క్షేత్రమున నద్యావిర్భావమునకై 'అగస్త్యుఁడు తప మాచరించిన సందర్భమున నీ ఋతువర్ణనముఁగాంచగలము. భూజనుల వేడుకకై మాత్రమెకాక, 'భవకిల్బిషవిద్విష దక్షసింధువును జేయుటకు అగస్త్యుఁ డుగ్రతపము నను:గడంగెను అభ్రవాణియు నాతన కభీష్టానుకూలమగు వాక్యమునే పలికెను. అగస్త్యుని తపమున గ్రీష్మ, వర్ష, శిశిర ర్తువులు వర్ణితములయినవి.

గ్రీష్మర్తువర్ణనము :- అగస్త్యుని తపమున మొదట ఎండకాలము వర్ణింప బడినది.

దూరీకృతోన్నతభారకంచుక వధూ
 జనము మానవకరాంచద్వ్యజనగ॥
గంధసారాచల గంధవాహా రిరంసు
 జన్యముష్ణీకృత శ్వాసచయము
విక్షిప్తజల సమావిర్భూత బాష్పభూ
 తల, మధ్వగాయస దాయకంబు
ప్రపా రోశ్వరీ పరీరంభణ ప్రత్యూహ
 కారి, ఘ:రోష్మదకోద్గమనపర్త

యంబరాంతర విశ్రంభ రాంబుపూర
సంచరిష్ణుపరస్పరస్థలవిహార
సమభిలాషప్రవర్ధిష్ణు చటుల తాప
మంత నేతెంచె దారుణోష్ణాగమంబు.[1]

ఎండకుఁ గొలంకులెల్లను, మహీధరములున్ దవవహ్నికీలలన్
మండెఁ, ధరాతలం బినుపమంగలముం బలెనుండెఁ గాలి, యా
యెండల నేమి సెప్పఁ బరమేశ్వర ! యావరణాంబురాశి తే
కుండిన, నాఁడె పాకికినడకుండునె పద్మభవాండభాండముల్[2]

స్త్రీలు తమస్తనకంచుకములను విడుచుట, మనుజుల చేతులందు విసనకర్రలుండుట, మలయపర్వతమున విహరింపకోరిక కలుగుట, భూమినుండి ఆవిరి ఎగయుట, దాటసాయల కాసనముగలుగుట, పర్యంకౌంగిలింతల కెడబాటు కలుగుట, భూమ్యాకాశములందును, నీటియందును తిరుగుప్రాణులు వేఱొకచోఁ దిరుగుటకు కోరుకొనునట్లుచేసెడి తీవ్రతాపము కలుగుటయు, తీవ్రమై భయంకరమైన వేసవికాలము ధర్మము,

కొలఁకులన్నియు నెండిపోయెను. చంద్రశిలలవే కొంచెము మండిపోవుచుండెను. భూమి అంతయు ఇనుప పెనమువలె వేడెక్కెను. చుట్టునుండు సంద్రము లేకుండిన భూమండలము పగిలిపోయెడది. ఎండవేడిమి యెంత తీవ్రముగా నుండెనోయనునది యీ రెండు పద్యములందును సహజసుందరముగా వర్ణింపఁబడినవి. ఇందు కవిలోకజ్ఞత, పరిశీలనములు స్పష్టములగుచున్నవి. సీస పద్యమున ప్రతిపాదము రెండు రెండు సమాసములచే కూర్పఁబడుటయు, మొదటి సమాసము రెండవ దానికన్న పెద్దదిగనుండుటయు రెండవ సమాసమందలి అర్థమునకు మొదటి సమాసమందలి యర్థము దోహదము చేయుచున్న దనిపింపఁగలదు. స్తనములమీఁది కంచుకము విడుచుట, విసనకర్రతో విసరుకొనవచ్చుటయు, వెచ్చని ఊర్పులు, చల్లని పర్వతములమీఁది కేగవలయు నను

1 శ్రీ.కా.మా. 1ఆ - 122ప.
2 శ్రీ.కా.మా. 1ఆ - 123ప.

కోరికకు బాటసారుల కాయాసము గల్గుటకు భూమి ఆవిరి విడుచుటయు, ప్రాణేశ్వరిని కౌఁగిలింతలఁజేర్చుకుండుటకు ఒడలు చెమటపట్టుటయు కారణము లు, ఫలితములుగాఁ బలుకుట జరిగినది.

రెండవ పద్యము తెలుఁగు జాతీయతకు, పలుకుబడికి దర్పణముగా నున్నవి. ఎండుట, మండుట, పొక్కిపడుట, ఇనుపముంగలుసుపవె నుండుట అను నివి ఎండ తీవ్రతను చక్కఁగా రూపింపఁజాలియున్నవి. ఋతువర్ణనమునఁ గ్రీష్మర్తువర్ణనము పలుం కొలఁది కవులు కావించియున్నారు. నన్నయ, నన్నెచోడుఁడు, ఎఱ్ఱన మున్నగు వారెందఱో కావించిన వానిలో నొండురెండీ సందర్భమునఁజూపఁగలను.

నన్నయ్య పద్యము :-

ఉరుతర దావపావక శిఖోత్కలిత శ్వసనంబులన్ సితే
తరగతి తీవ్రతిగ్మకరధామ సహస్రములన్ బహుప్రవా
హాదహితి నిమ్నగాతతులునై కనుపీక్షములై నిదాఘవా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబులై.

నన్నెచోడని పద్యము :-

ఆతపభీతి నీడలు రయంబున వృక్షముల క్రింద దూఱెనో
యా తరులుం దృషాభిహతులై తమనీడలు దారు ద్రాగెనో
భీతి ననంగ నీడ లుపపాదపమూలములం దడంగె గ్రీ
ష్మాతత మధ్య వాసరములందుఁజలింపక యుండు నెండలన్.

ఆమునిపలలో తిర్పతి వేంకటకవుల పద్యమొకటి యత్యంత రమణీయముగానున్నది.

ఇతరుల దాహపుం గతులనెన్నఁగనేల ? దినేశుఁడంత వాఁ
డతి తరతృష్ణచేదన సహస్రకరమ్ములు సాచి నేమపుం
గతి విడనాడి గుంటలనె గాదు, నదమ్ములఁగాదు, కూప సం
తతులనె కాదు కంటికిఁ గనంబడినంతయుఁ ద్రావె నీరముల్.

వర్షర్తువు :- నాలుగు పద్యములందునడిచిన యీ వర్షర్తు వర్ణనము కవి ధూర్జటి వర్ణనా నిపుణతకు, పంచభూత తత్త్వనిరూపణకు దారకాణయై యున్నది.
మబ్బులుపట్టుట, ఉఱుములుఱుముట, వర్షములు ఇతర భూతముల నణఁచివేయుట ఏవర్ణనమున గలవు.

**అంతం బూర్వపు వైరముం దలఁచి వింధ్య గ్రావకూటంబు ల**
**భ్రాంతంబంతయుఁగప్పెనో, జలధి యాత్మారాతిపైఁ బోయి నిఁ**
**ర్జింతుంగా కని యెత్తివచ్చెనో, తనుంజెంఁడాడు భాస్వంతు మా**
**యింతుంగాకని నిల్చెనో యిరులు, నా నేఁతెంచెఁగా లాభ్రముల్.***

అగస్త్యుని తపమూచరించు సందర్భమున, నీ పద్యమున వింధ్యగిరి ఆకాశముపై దండెత్తి ఆక్రమించెనోయని ప్రారంభించుట మిక్కిలి సముచితమైన సందర్భము తన తలవంచి గురుఁడగస్త్యుఁడు వెడలగనే, వింధ్యుఁడు ఆకాశముపై ప్రతీకారేచ్ఛతో తిరిగి పెరిగి క్రమ్మివేసెనో యనునట్లు నల్లని మబ్బులావరించుట యిది. మెఱువుతోఁబోటీగా పెరిగిన వింధ్యవలన సూర్యచంద్రుల గమనము నిరోధి పబడుటచే వెలుఁగులేక, అంతయు అంధకారబంధురమగును. మబ్బులు నల్లగా నుండుటం విధముగా నూహించుట రమణీయోత్ప్రేక్షమే. సముద్రము తన శత్రువగు నాకాశముపై దండెత్తెనా యన్నది రెండవ యుత్ప్రేక్ష. సముద్రజలము నీలముగా నుండునని వర్ణించుట కవి సమయమే కాక, దూరమునుండి అట్లు కన్పించుట, ఆకాశనీలిమ ప్రసారమని శాస్త్రజ్ఞులందురు. అదియుగాక సముద్రజలమును, ఆవిరిచేసి ఆకసమెత్తుకొని పోవుటయు కలదుకదా! కనుక సంద్రమున కంబరము శత్రువే. కాన ఎండాకాలమేఁగిన వెనుక సముద్రమునకు సూర్యతాపము తొలఁగునుగాన స్వేచ్ఛగా నది ఆకసము మీఁదికి దండెత్తి వచ్చుననుట యిది. ఇది యిందలి స్వారస్యము.

ఉఱుములు, మెఱుపుల వర్ణనము తెలుఁగుఁబలుకుబళ్లుచేఁ గవి వర్షమునకు బలిమి చేకూర్చిన వాఁడయ్యెను.

---

* శ్రీ.కా.మా. 1ఆ — 126ప.

మొగులు మొగులున మెఱుఁగులు నిగుడ దొడఁగె
మెఱుఁగు మెఱుఁగున నుఱుములు మెండుకొనియె
నుఱుము నుఱుమంగఁ బిడుగులు నుప్పతిల్లె
నింతకంతకు వర్షంబు నెక్కుడయ్యె ...*

ఇందు 'వర్షంబు' అన్న యొక్కటి తత్సమము. ఈ పద్యమున ప్రతిపాదమున కవి ప్రతిభ యత్యంతముగా మెఱయుచున్నది. మబ్బులు దట్టముగా ఒకదాని సరసన నింకొకటి చేరుట, ఒకదానికొకటి తగిలిన యొరపిడి వలన మెఱుపులు కలుగుట, మొదటిపాదము సూచించుచున్నది. అన్నియు లఘువులే. మబ్బులెంత దగ్గరగానున్నవో, మెఱుపులెంత వేగముగా కనిపించి కనుమఱుగగు చుండెనో యీ సర్వలఘుపాదము స్పష్టపఱచుచున్నది. రెండవపాదమున ఉఱుములు ఉఱుముటను 'మెండుకొనియె' అను క్రియా పదమున పూర్ణబిందు పూర్వక 'డ'వర్ణ ప్రయోగము, సూచించుచున్నదనవచ్చును. అట్లే మూఁడవ పాదమున 'ఉఱుమంగ బిడుగులు నుప్పతిల్లె' అను వాక్యమున 'గల' మందలి గురువు, తుదిరెండు 'గల' ములు పిడుగుల శబ్దము, ప్రతిధ్వనులను సూచింప జాలి యున్నవి. తుదిపాదమునందలి గణములన్నియు గురుసహితములై, వర్షాధిక్యమును సూచించుచున్నది.

'నీరు నేల మెఱుఁగును నింగి గాడ్పుఁదానయై' ముని తపమాచరించినాఁడు. ఇందలి పంచభూతములను తానేయైనట్లు నీరు వర్షించినట్లు పేర్కొనఁబడినది. నీరు, ప్రక్కన నాలుగు భూతములను ముంచివేసి యంతటను తానుగనే కనుపట్టినదఁట. అనఁగా వర్షాధిక్యమంతటిదని సొగసైన యర్థము. కాన సర్వభూతములును నీరుగఁగను పట్టుటచే మునియు పంచభూతస్వరూపుఁడై తపమాచరించినాఁడనుట.

ప్రళయవేళా సముద్భవ పుష్కలావర్త
కాది పయోద వర్షాంబు వసంగ
నూర్ధ్వాండకర్పరం బుఱుములచే ప్రక్క-

---

* శ్రీ.కా.మా 1ఆ—127 ప.

లై కాలు నావరణాంభ మనఁగ
జండాంశుకరములు రూపమై ధరా
భువనంబు నొక్కటఁబొదివె ననఁగ
ధరణిపైఁబాఱంగ సురలు దీర్చిన యభ్ర
గంగాప్రవాహంపుఁగాల్వ లనఁగ

వాయువును, మిన్నుఁ దేఁజబు వసుమతియును,
జీవనాకారముఁగను వరిర్చి పఁదొడఁగె
నీరు నేలయు మెఱుంగును నింగి గాన్పుఁ
దానయై ముని యోడక తపముచేసి.*

వర్ణించిన నీరము మిగిలిన నాలుగు భూతముల నావరించినదనుట ఎత్తుగీతి యందు మొదటి రెండు పాదములను చేసిన వాచ్యమునకు, మీఁది సీసమందలి నాలుగు పాదములందు సూచనకలదు. సీసమందలి మొదటిపాదము 'ఝంఝాల' శబ్దముచే వాయువు, రెండవ పాదమున 'ఊర్ధ్వాండ' శబ్దముచే నాకాశము, తృతీయ పాదమున 'చండాంశు' శబ్దముచే తేజము, చతుర్థపాదమున 'ధరాభువన' శబ్దముచే పృథివియు అను నాలుగు సూచింపఁబడినవి. వీనిని క్రమముగా ఎత్తుగీతియందు 'వాయువు, మిన్ను, తేజంబు, వసుమతి' యని పేర్కొనినాఁడు కవీంద్రుఁడు. అదియునుగాక మునీంద్రుఁడు ను పంచభూతస్వరూపుఁడై తపమాచరించెనను గీతమందలి నాల్గవ పాదములోని క్రమము చూచి, సృష్టిక్రమము కవిచే సాభిప్రాయముగనే ప్రయుక్తమైనట్లు గమనింపఁ దగును. ఉపనిషత్తుల పేర్కొనఁబడిన పంచభూతములు, సాధారణముగాఁ పేర్కొనఁబడు 'పృథివీ, ఆపస్, తేజస్, వాయుః, ఆకాశః' అనునట్లుండుటంచే ఒకనీరు మాత్రమే ముందునకువచ్చి, మిగిలిన క్రమము మార్పునొందకుండుట చూడ, గీతము మొదటి రెండు పాదములందు పేర్కొనఁబడిన వీనిని, మిగిలిన భూతములను నీరు ఆవరించి ఆక్రమించెననుట మహార్థమైనది సూచ్యముగుచున్నదని గీతమందలి మొదటి పాదము

---

* శ్రీ.కా.మా. 1ఆ - 128ప.

స్కారింపఁబడిన క్రమము 'వాయువును, మిన్ను, తేజంబు, వసుమతియు' అన్న విధమున వాటియొక్క విశేషము స్ఫురింపఁగలదు. తక్కిన భూతములను నీరాక్రమించుటచే పంచభూతాత్మకమగు ప్రకృతి వికృతిచెందెనా యన్నట్లు, అవి విలోమ క్రమమునఁబలుకఁబడినట్లును మనము గమనింపఁగలము. ఇట్టి విచిత్ర, విశిష్టవిధానము కవి ధూర్జటి ఊహాయందు నిలిచినట్టిదే యనవలసియున్నది. కానిచో, ధూర్జటి పంచభూతములను క్రమముసే వర్ణింపలేక పోవునా?

ఇంక వర్షమును వర్ణించుమూఁడవ పద్యము :-

తెలుపుం దేజము నంతనంతట, దటిత్తీవ్ర ప్రభాపుంజమై
తలచూపుఁన్ ధర మేదినీధర శిఖాదంభంబునన్ గర్జగా
బలుగిచ్చున్ గగనంబు, వర్షసఖుఁడై యేతెంచుఁగాడ్పున్, దమున్
జలదాసార ముడంచెనో? యని జను ల్శంకింపకుండ న్మదిన్,*

పంచభూతములందు నీరు విజృంభించి, మిగిలిన వానిని కప్పదలఁచి ఆక్రమించినప్పుడు జనులు కల్లోలపడుచుండ, నా నాలుఁగు భూతములను సడుమసడుమ తాము న్నట్లు తెలుపుటను కవి చక్కఁగా చమత్కరించినాఁడు. ఎడతెఱపిలేనంత వర్షముపడుచున్నప్పుడు నడుమ మెఱుపులు వచ్చుట తేజమునకు, అప్పుడప్పుడు కప్పబడి కొండ శిఖరములు కన్పడుట, వినిపించు ఉఱుములు ఆకసమునకు, వర్షమునకు తోడుగా వీచుగాలి వాయువునకు చిహ్నములుగా గన్పడుచున్నవసుట యిందలి చమత్కారము 'తెలుపుం దేజము' 'తెలుపు' శబ్దము క్రియగనేకాక, తేజమును విశేషణముగా గూడ గ్రహింపఁదగియున్నది. కొండశిఖరరూపమున నేల తలయెత్తి చూచుట, ఆకాశముగర్జనగా గొంతెత్తి పలుకుట యనునది రమణీయార్థ ప్రతిపాదకములై యలరుచున్నవి. అభ్రమునను వర్ణించుటయందు మహాసుందరభావసమంచితముగా చిత్రించిన తెలుగు కవులనేకులున్నారు

యమునద్గంగము కృష్ణభూమదిలమున్జాతోన్నసుష్యంబు నీ
లమహీంధ్ర న్నిఖిలాచలాళిలి తమాల ద్భావ మిందీవర

* శ్రీ.కా.మా. 1ఆ - 129ప.

తుక్కముద్రశ్రేణి వికద్విపింగము దనస్తోమద్రవార్త్మప్రభా
సముదాయంబగుచుండె లోక మలఘుశ్యామాభ్రము ల్పర్విసన్.[1]

మేఘమును ప్రబంధముతో సుపమించినాడు రామాభ్యుదయ కర్త రామభద్ర కవి.

ధారాశుద్ధిఁ బ్రసిద్ధిఁ గాంచి ఘనశబ్దస్ఫూర్తి వర్తిల్లగాఁ
దోరంబైన రసస్థితిన్ దరళవిద్యున్మాలికాలంకృతో
దారంబై కవిసేవ్యవశా వనమయూరా రూఢిఁ బ్రాపించి న
ద్ధారంభంబు ప్రబంధమట్లఖిల పద్యాక్రాంత మయ్యెందగన్.[2]

అన్యాయంబున హెచ్చి గ్రీష్మఋతురాజు శ్రాంతమున్ భోజనో
దన్యాతాపము నేర్పరింపఁ గని క్రోధస్ఫూర్తి గర్జిల్లి ప
ర్జన్యుం డుగ్రభరథస్థితిన్ మణిగణచ్ఛాయల్ దలిర్పన్ మహా
జన్యస్థేమము సూపెనో యన శరాసారంబు పర్వెన్ వడిన్.[3]

సీతువు :—

ఆ తరువాత జంతునివహంబు వడంక, నణంకు వేది యో
షాతతి ప్రాణవల్లభుల సంతతముం బరిరంభణంబులన్
బ్రీతులఁ జేయ, సూర్య శశిబింబ మటంచుఁ జకోరదంపతుల్
భీతిఁ దొలంగవచ్చె నతిభీకర శైత్యము శీతకాలమున్.[4]

---

1. ....... భాస్కరరామాయణము కిష్కింధ - 381 ప.
2. ....... రామాభ్యుదయము 6 13 ప.
3. ....... శకుంతలాపరిణయము. కృష్ణ 1ఆ — 142ప.
4. శ్రీ.కా.మా. 1ఆ — 130ప.

చలికాలపు ప్రభావమును వర్ణించు నీ తావున ధూర్జటి పల్కిన 'సూర్యశశిబింబమటంచు చకోరదంపతుల్ భేదమొందుచు'ట చక్కని యూహాచ. కోరదంపతులు చంద్రుఁడున్నప్పుడే వచ్చును. సూర్యుని వేడిమి కవి బయటకురావు. వెన్నెలయే వాని ఆహారముకదా! సూర్యుని చంద్రునిగా భావించెననఁగా సూర్యుఁడు వేడిమిని కోల్పోయెనని. అనఁగా నా కాలమున చలియెక్కువ సూర్యసంతటి వాని వెట్టనే చల్లబడిపెనని యందమైన భావన. చలిబాధ పడలేకయే త్రిమూర్తులు సంతతవధూ యోగమునం దుండురట.

ఈ హేమంతము రాకఁజూచి రమణీ హేలాపరీరంభ స
త్సాహాయ్యంబునఁగాని దీనిగెలువన్ శక్యంబు గాదంచుఁదా
రూహాపోహా విధింద్రిమూర్తులు సతీయుక్తాంగులైనారు గా
కోహో! వారలదేమి సంతత వధూ యోగంబు రాఁగందురే ?

(పోతన భాగవతము)

సూర్యుఁడు త్వరగ నస్తమించుటను పోతన చలి కారణముగనే యని యుత్ప్రేక్షించినాఁడు.

పొడుపుఁగొండమీద బొడచుట మొదలుగాఁ
బరువు వెట్టి యినుఁడు పశ్చిమాద్రి
మఱుఁగుఁజొచ్చెఁగాక మసలినఁజలిచేత
జిక్కఁ జిక్కెననఁగఁ జిక్కకున్నె.[1]

చలిబాధ నత్యంత మనోహరముగా శ్రీనాథుఁడు వర్ణించియున్నాఁడు.

ప్రక్కలువంచు, వంచిమునుపంజ్లను పంజ్లనరాచు రాచి ఱొ
మ్ముకిక్కలఁజేయుఁ జేసి తలయుల్లనఁ గాళులసందు సందిలో
చక్కిలినొక్కుఁ, నొక్కి యిరుచంబడ గుమ్మడిమూటగట్టి పీ
పెక్కఁ దువాళిచేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేకువన్.[2]

1. భాగ. 10స్కం. పూర్వ - 801ప.
2. క్రీ.రా. 46ప.

4. ప్రయాణము :-

మన ప్రబంధమున నీ ప్రయాణము మూఁడు తావులఁ గనగలము. ప్రథమా శ్వాసమున లోపాముద్రాగస్త్యులయాత్ర, తృతీయాశ్వాసమున నక్కీరుని తీర్థయాత్ర, చతుర్థాశ్వాసమున వేశ్యాతనయల యాత్రలు వర్ణింపబడినవి.

ప్రథమాశ్వాసమున—

'వింధ్యపర్వతగర్వంబు విఱుగఁద్రొక్కి-
గౌతమీ కృష్ణ వేణ్యావగాహనములు
సేసి శ్రీశైలనాథు దర్శించి జ్యోతి
సిద్ధవటినాథుఁగొల్చి— లోపాముద్రాగస్త్యులు

శ్రీకాళహస్తీశుని దర్శింప నేఁగుదెంచిరి. వీరి యాత్ర శ్రీకాళహస్తీశునే దర్శించుటకు, సేవించుటకు బయలుదేరకున్నను, శ్రీకాళహస్తి చూచిన వెనుక ముందుసకేఁగక. ఆ క్షేత్రమాహాత్మ్యమునకు, ఆ దైవత దివ్యత్వమున కానందమంది, యచట నది లేకుండుటచే చింతించి యందులకు తపమాచరించి, స్వర్ణముఖరీ నద్యావిర్భావమునకు హేతుభూతుఁడగుటచే, నాతని సంతగా నుగ్గడించిన ఫణారాజన్మహాలింగమును కవి ధూరటి తన కత్యంత ప్రియతమమైన అనుప్రాసాలంకారములచే నలంకరించెను.

ప్రణతుల్సేయుచుఁగాంచెఁగుంభజుఁడు లోపాముద్రతోఁగూడి ద
క్షిణ కైలాసము నంబికాహరకృత శ్రీపాదు కాన్యాసమున్
మణిమంత్రౌషధవాసమున్, భవ మహావిపర్యాసమున్
గణనాతీత నటీవిలాసము, సమగ్రశ్రీ సముల్లాసమున్.[2]

కాంచెన్ వంచిత పాంచభౌతిక సుఖాకారాంగమున్ జిన్నటీ
సంచారాంచిత రింగమున్, ముని మనస్సమ్యక్పరిష్వంగమున్

1. శ్రీ.కా.మా. 1ఆ - 108ప.
2. శ్రీ.కా.మా. 1ఆ - 109ప.

బంచాస్త్రారిపు మరుద్భుజంగము, గృపా పాణింధమాపాంగమున్
బ్రాంచన్ముక్తి కళత్రసంగము ఫణారాజన్మహాలింగమున్.[1]

దక్షిణకైలాసము అందలి ఫణారాజన్మహాలింగముల దర్శనవర్ణనమిది

తృతీయాశ్వాసము:- వర్ణింపబడిన ప్రయాణములందే నత్కీరుని యాత్ర ముఖ్యముగ వివరింపబడినది. ఉత్తర కైలాస దర్శనాపేక్షియై బయల్దేరిన నత్కీరుడనేక తీర్థములు, క్షేత్రములను నవగాహముసేసియు, దర్శించియు, దైవతముల నర్చించియు, తుదకు సుబ్రహ్మణ్యేశ్వరు ననుగ్రహముచే దక్షిణ కైలాసము దర్శించి శాపవిముక్తుడయ్యెను. ఈ యాత్రయందాతడు పెక్కు, పట్టణములను, నదులను, కొండలను, అడవులను, దేవాలయములను చూచుచు నేగెను. ఈ వర్ణనమున ధూర్జటి రసవద్గద్య రచనా చణత్వము వెలార్చినాడు. రెంటిని అంత్యానుప్రాస, వృత్త్యను ప్రాసాది శబ్దాలంకారములు గై సేసినాడనదగును. చెవ్వందీశ్వరుని, జంబునాధమును, కావేరి నదిని, అరుణగిరిని, తిరువయూరినాయకుడగు ఓదిపెచ్చనయనారుని, ఏకరసాలేశ్వరుని, పెన్న. గుండ్లకమ్మ, కృష్ణవేణి, గౌతమీగంగ, పీఠికాపురము, సింహాచలము, శ్రీకూర్మము. గోకర్ణము, పురుషోత్తము, కృత్తివాసము, కటకము, జలేశ్వరము, నందనేశ్వరము, గగనేశ్వరము, గయ, గంగ, కాశి,అరణ్యము, సరస్సులను గాంచెను.

ఈ సర్వవస్తువర్ణనమునందును గవీంద్రుడు తన కవిత్వముతోబాటు వ్యక్తిత్వమును గూడ వెలార్చియున్నాడు.

చివ్వందీశ్వరు నీశ్వరేశ్వరునిఁగాంచెన్, భీషణాంహోలతల్
ద్రెవ్వం, దీవ్రతరాంగసంభవ శరశ్రేణీవిదాహవ్యథల్
వివ్వం ——[2]

చనిచని దాఁటెనంతఁ గవి చంద్రుడు ధన్యఁగవేరకన్య, జీ
వనశితఖడ్గ ఖండిత భవ ప్రభవాఘవిరోధిసైన్య —[3]

---

1. శ్రీ.కా.మా. 1ఆ - 112ప.
2. శ్రీ.కా.మా. 3ఆ - 180ప.
3. శ్రీ.కా.మా. 3ఆ - 182ప.

అరుణగిరింద్రకూటముఁ, గృతాఘకపోలచపేటమున్, నిరం
తరభవ దావపావకవిదాహకృపీటము—[1]
—— అంహోమతంగ సింహంబగు సింహాచలంబును—[2]

పైవానింనాతని భవనిరాసము, వైరాగ్యములు వ్యక్తములగుచుండగా, నతని ముక్తి కాంక్షను వెల్లడించుటయు నరయవచ్చుటులఁగాంచఁగలము.

'— నిత్యము, జ్జనరతకోటి ముక్తిపద, సౌఖ్యకదాన్య—[3]
—— ప్రదీపితముక్తివధూకిరీటమున్ ——[4]
—— శివున్ముక్తి వారి రుహాక్షీపతిన్ ——[5]

...... ముక్తివధూ చరణకటకంబును .. [6] ఇత్యాది చోట్ల నాతని ముక్తికాంక్షఁ జూడఁ గలము. నదులు, సరస్సులు, మఱ్ఱివృక్షముల వర్ణనలను వేఱుగా గాంచనగును.

చతుర్థాశ్వాసము:—

వేశ్యాతనయలు, దొంగమాటలునమ్మి శ్రీకాళహస్తీశ్వరునిఁగాంచఁబయనమైరి. కుంభకోణముఁ గుంభేశుఁగొలిచి, చిదంబరమేఁగి, సంభ్రమముఁజూచి, శ్రీకాళహస్తికి సమీపమునంగల అరణేంది, సరోవరమునుఁజూచి యచటి వారీశ్వరునిఁబూజించి, శైవునిఁగాల్చి, శ్రీకాళహస్తీశునిచే శ్రీకాళహస్తికిఁ గొంపోఁబడిరి. వారిపూజించిన లింగమును, వారు అపవర్గమానిభుఁగా భావించిరి భైరవాన్వయమగు కొండయు 'ఘోరసంసారదుఃఖదవాగ్నివ్యథఁబాయ'ఁ జేయునదియు.

1 శ్రీ.కా.మా. 3ఆ 184ప.
2. ,, 3ఆ 188ప
3. ,, 3ఆ 182ప
4. ,, 3ఆ 134ప
5. ,, 3ఆ 187ప
6. ,, 3ఆ – 183ప.

5. వేట :- తిన్నని కథయందీ వేటవర్ణనము గలదు.[1]

తిన్నని తండ్రి నాథనాథుఁడు కొడుకును తగిన వారలను వేటకుఁ జనుమనెను. వేట వర్ణనమున కవి ధూర్జటి లోకజ్ఞత స్పష్టమగుచున్నది. ఆటవికజీవనముతోడను, ఆటవిక వస్తువులతోడను మిక్కిలి పరిచయము, వేటకేఁగువారి సంరంభము, వేట సాధనము లయు జంతువులయు పరిచయము ధూర్జటికి మిక్కుటముగా గలదని యెఱుఁగఁగలము వలలు, వేటకుక్కలు. ముంగిసలు, సివ్వంగులు, ఎద్దులు, వేటపక్షులు, బోనులు, చిక్కములు, త్రాళ్లు మున్నగువాని వివరములను, వేటలందు గల తెరవేఁట, డేగవేఁట, ముంగివేఁట, ఏదువేఁట, సివ్వంగివేఁట, ఇఱ్ఱివేఁట, గంటవేఁట ఎద్దువేఁట, విడివేఁట,పొంచువేఁట మున్నగు విధములనగు జంతువులను వేటాడుటలందలి యొడుపులు వర్ణించినతీరుఁజూడ, కవీంద్రునకు వానియందలి ప్రత్యక్షానుభూతి తెలిసికొనఁగలము. ఇది యతని పరిచయశక్తికి తార్కాణ. తిన్నఁడు వేటయందు పట్టిన జంతువులనొక మాలగా గ్రుచ్చి తండ్రికి కానుకగాఁ బంపెనఁట. ఆ జంతువులక్రమము నొక చంపక మాలయందుఁగూర్చినాఁడు కవి.

> పులులు, కురంగముల్, లకురటిపోతము, లేదులు, మన్నుఁబిళ్లు, దు
> ప్పులు, కణుఁతుల్, లిక్కటుల్, చెన్నుపులపోతులు, కొర్నవగండ్లు, భల్లుకం
> బులు, చమరీమృగంబు, లెనుపోతులు, కస్తురిపిల్లు, లాదిగాఁ
> గల మృగరాజిఁ బెక్కువిహగంబులఁ గానుకలంపెఁ దండ్రికిన్[2]

పెద్దన మనుచరిత్రము, ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రము, పిల్లలమఱ్ఱి పినవీరన శాకుంతలము లందును, రామభద్రుని రామాభ్యుదయము, మట్ల అనంత భూపాలుని కకుత్స్థవిజయము, అల్లమరాజు రామకృష్ణకవి కవిచకోరచంద్రోదయము, లిత్యాదు లందలి వేటవర్ణనములున్నవి కాని యవి కోరితెచ్చి పెట్టుకొన్నట్లుండును. కాని మన

---

1. శ్రీ.కా.మా. 3ఆ - 46ప. మఱియు 47ప.

2. శ్రీ.కా.మా. 3ఆ - 48ప.

శ్రీకాళహస్తి మాహాత్మ్యములోని వేటవర్ణనముకథలో సంపర్కశుద్ధియు, సహజత్వము కలిగియున్నది తిన్నని యా వేట, యుడుమూరినుండి కొండదరి నున్న జ్ఞానాజన్మప్రాలింగము కడకు తిన్నని జేర్చి కథను దోహదము గావించి ది.

6. సాగరము :- వేశ్యాతనయలగాథయం దీ సముద్రము వర్ణింపఁబడినది. మూఁడు కందములలో, రెండు సీసములలో సముద్రము వర్ణింపఁబడినది.

భంగపరస్పరఘట్టన
భంగసముద్భూత బిందుపటలంబు, మరి
త్తుంగవులకుఁ దానొసఁగు న
భంగుర మౌక్తిక వితానభంగిం దనరెన్ [1]

అను కందపద్యమున భంగోత్తుంగము సంద్రపుటలల ఘోష వినఁగును గవి కవి రత్నాకరమను నామమునకు సార్థక్యతకూర్చినాఁడు తరువాతి పద్యమున

రత్నము లిభరత్నముఁదరు
రత్నవధూరత్న ధేనురత్నంబులు, గ్లౌ
రత్న మమృతరత్నము హరి
రత్నమునుంగలిగి మెఱయు రత్నాకరమున్ [2]

ఆ సముద్రమున దొరికినవన్నియు రత్నములేకాని రాలు, నత్తగుల్లలు కావను రమ్యార్థమును, నన్నివిధములయిన రత్నముల కాకరము కనుకనే యది రత్నాకరమనుట సార్థకమైనది.

సముద్రము నీలముగా భాసించును. ఆ నీలిమ మేఘములు. ఇంద్రుఁడు, నల్లనికాటుక, నల్లగలువ, కస్తూరి, తుమ్మెదల నీలవర్ణములతో నుపమింపఁదగియుండుట యటుండఁగా

1. శ్రీ.కా.మా 4ఆ—61 ప.
2. శ్రీ.కా మా. 4ఆ - 62ప.

నా నముద్రమందలి నీలవర్ణమునకు కారణము నుత్ప్రేక్షించుటయందుఁగవీంద్రుని యుపజ్ఞఁదెలియఁగలము

తనయందుఁ బవ్వళించిన నీలవర్ణుని
నీడ నీరంబెల్ల నిండెననఁగ
హేళికినోడి తా నెటకుఁబాఱఁగలేక
తనయందుఁదిమిరంబు దాఁగెననఁగ
దనయందుఁబడబాగ్ని ఘనతరజ్వాలలు
మండఁగ నుదరంబు మాఁడెననఁగ
జంబూఫలద్యుతి నంబరంబంతయుఁ
దనయందుఁ బ్రతిఫలించినదియనఁగ
నీరదప్రాప పురుహూత నీలకజ్జ, లాతసీపుష్ప కస్తూరికాళిజాత
సన్నిభచ్ఛాయఁగనుపట్టు—" నట సాగరేంద్రుఁడు *

సంద్రమున హరి పవ్వళించుట, బడబాగ్ని యుండుటలు పురాణప్రసిద్ధములుకాగ, హానిచే ప్రధావితమైనట్లు, చీఁకటిదాఁగినట్లు, ఆకసపు వర్ణమంతయు ప్రతిఫలించినట్లు పల్కుట యందు ధూర్జటి లోకజ్ఞత,శాస్త్రజ్ఞతలు, వ్యక్తములగుచున్నవి. ఇందాకవి యుపజ్ఞతయు వ్యక్తమగుచున్నది.

దరిదన్ని తిరిగెడి తరఁగలు చనుదెంచు,
తరగలు నొండొంటిఁదాకు రవము
గుములు గూడుక కంథరము లాకసముదిగ్గి
నీరంబుఁ గ్రోలెడి నిబిడరవము
మబ్బునఁ గనరెత్తి యుబ్బి యంతంతకుఁ
బొరలంగఁబడియెడు భూరి రవము
ననుదిన పూర్వాపరాహ్ణ వేళలఁబోటు,
పొడిచి విచ్చిన పోటి భోరు రవము

* శ్రీ.కా.మా. 4ఆ - 63ప

దశదిశాభాగముల ప్రతిధ్వనుల నీన,
మలయశైలాది గిరిగహావాస సింహ
శరభ శార్దూల హృదయ భీకరములగుచుఁ
దనకు నైజంబులుగ మించు వనధిరాజు. [1]

సముద్రమును శంభుమూర్తితో నుపమించిన వర్ణనము ఒకటి పంచతంత్రమునఁ గను పట్టుచున్నది.

రంగదుత్తుంగ తరంగ సంఘంబులు, సరసాభినయ కరాబ్జములు గాఁగ
బహువిధప్రచలన పాఠీనపంక్తులు, ధవళవిలోల నేత్రములు గాఁగ
సురుచిర స్నిగ్ధ పాండుర ఫేనపటలంబు, చారుతరాట్టహాసంబు గాఁగ
బోలునని తన్ను జనములు పొగడునట్టి వర్ణనకు నెక్కు యొప్పు మహా
ర్ణవంబు___ [2]

సముద్రమునే గంధగజముతోఁ బోల్చినాఁడు అయ్యలరాజు రామభద్రుఁడు.

— గంధగజలీలఁ గ్రాలు సాగరముఁగాంచి,

... గంధగజలీలఁ గ్రాలు సాగరముఁగాంచి, [3]

**7.** ఋష్యాశ్రమము :— మన ప్రబంధమున వశిష్ఠుని తపము, అగస్త్యునితపము బ్రహ్మర్షితపములు, గావించిన సందర్భములు గలవు.

**వశిష్ఠుని తపము :—** రాజయోగజాల మూసపడి వశిష్ఠుఁడుగ్రమైన తపమాచరింప బూనెను.

---

1. శ్రీ.కా.మా. 4ఆ — 60ప.
2. పం.తం.మూ.నా. 4ఆ — 6ప
3. రామా. 7ఆ — 38ప.

దానానేకపముల్ కరాపహృతపాథఃపూరముల్దెచ్చి యు
ద్యానక్షేత్రం జలకంబులార్పఁ జమరీ జాలంబు వాలంబులన్
వీవం గ్రోఁతులు పండ్లు గానుకలు గావింపం, గిరాతాంగనల్
సేవ స్సేయఁ జెలంగె నమ్ముని తపస్సింహాసనాసీనుఁడై. [1]

అడవియేనుగఁులు తొండములతో నీరుదెచ్చి స్నానము లాచరింపఁజేయుచుండగా చమరీ మృగములు వీపులు వీచుచుండగా, క్రోఁతులు పండ్లు కానుకగా నిచ్చుచుండ యాటవిక స్త్రీలు సేవచేయుచుండఁగా. వశిష్ఠుఁడుగ్రతపమాచరించెను. ఆ తపమాచరించిన తావు మహిమనుగ్గడించుచు కథాసూచనము చేసినాఁడు

శుండాలాగ్ర్యక షండగండతల ఖర్జూ భగ్ననోపార్జనా
ఖండగ్రావము, చండకుండలి విశోక వ్యాప్తికింపైన శ్రీ
ఖండస్థాణువు, శారికా శుక విహంగవ్రాత పుంజేతు కో
దండక్రీడకు నీడమై, తపమతిస్థైర్యంబునన్ జేయఁగన్. [2]

ఇందు ఏనుగు, పాము, దక్షిణకైలాసాద్రులు ధ్వనింపఁజేయబడినవి.

అగస్త్యుని తపమున :- ఈ సందర్భమున కవి మూఁడు ఋతువులను వర్ణించుచున్నాఁడు. తపోవనవర్ణనము గావించియుండలేదు.

బ్రహ్మతపమున:- ఈ ఘట్టమున కవి ధూర్జటి ప్రచండసామాన్య ఋష్యాశ్రమవర్ణన గావించియున్నాఁడు. బ్రహ్మతపమునకు సకలభూతములు సేవలొనర్చినవి.

గాంగేయముఖరీతరంగసంగమ సదా, గతిమహోగ్రగ్రీష్మ దుఃఖముహారిఁ వ
సతత వాదంయమీశ్వర కృతక్రతు హవి, ర్జ్వలదగ్ని కీలలు చలినదంప
నికటద్రుమస్థిత నీలకంఠములు, పురలోద్ఘి వాసలబిరుసు మాన్ప
నాగంబు లాభోగభోగంబులడ్డంబు, పట్టి ఝుంఝూకిలపంక్తి నునుప

---

1 శ్రీ.కా.మా. 1ఆ - 72ప.
2 శ్రీ.కా.మా. 1ఆ - 73ప.

నఖిలభూతాత్మమూర్తియై యతిశయిల్లు,
కొందుకుఁబడయంగ సర్వేశుఁగూర్చి తపము
సేసె, నటుకాన బవనాగ్నిశిఖఘనేంద్రు,
లాదిగాఁగూడి విధికి సహాయులైరి.[1]

స్వర్ణముఖరీ తరంగముల సంపర్కముచే వీచుగాలి గ్రీష్మాతపమును పోగొట్టుచుండెను. మునీశ్వరుల యజ్ఞకుండములనుండి వచ్చి అగ్నిజ్వాలలు చలినణఁచుచుండెను. సమీప వృక్షములందున్న నెమళ్ళు పింఛములు విప్పి వాన మీదపడకుండ కాపాడుచుండెను. పాములు పడగలు విప్పి ఋఁఝూనిలము నాపుచుండెను. సీసమందలి పెద్దపాదములలో నాలుగవది మహారమణీయమైనది. పాములకు వాయువు కదా ఆహారము. మహానిలయ మును సైతము పాములుపడగలుపట్టి యాపివేయుచున్నవనఁగా, నా వాయువు నాహార ముగా లోఁగొనుటచే, గాలి యిఁక వానినివీడి ముందుకు సాగలేదు.

ఇక నాశ్రమమహిమాను వర్ణనము, శాంతరసమయముగా నున్నదని వర్ణించుటలో ధూర్జటియు ప్రబంధసామాన్యమార్గముననే పయనించెను.

తల్లిగానని లేడిపిల్లకుఁ జన్నిచ్చి, పెంచు బెబ్బులి తనబిడ్డయట్లు
దైవికంబున గూడు తప్పి నేలను బడ్డ రామచిలుక బోదలఁ బ్రోచుఁబిల్లి
యెండ చేఁ గాగిన కొండగోఁటియఁ దెచ్చి, యెలమావినీడల నిలుపుఁ గ్రోఁతి
యెడఁబాసిపోయిన పిడియేనుఁగులఁగూర్చి, కరిపిరహంబు కేసరి హరించు

స్తనితముల కెగఁబడినచ్చు శశభములను
బట్టి యొయ్యన ధాత్రిపైఁబెట్టి కాచు
గండభేరుండ పక్షులుగలిగి యజుని,
యాశ్రమము శాంతరసరూపమయ్యెనపుడు.[2]

---

1. శ్రీ కా.మా. 2ఆ_70ప.
2. శ్రీ.కా.మా. 2ఆ _ 71ప

తల్లిని కనలేక గిగులుచెందు లేడిపిల్లకు పెద్దపులి పాలిచ్చుట, నేలపైబడిన చిలుకను పిల్లి రక్షించుట, కొండగొఱియను క్రోతిరక్షించుట, ఆడేనుఁగు మగయేనుఁగును చేర్చి సింగము వాని విరహమును పోగొట్టుట, శరభములను గండభేరుండములు రక్షించుట ఏ యా శ్రమమునఁ గననగు విచిత్ర సన్నివేశములు. తపోవనభూములనిట్లు ఆజన్మ వైరులగు జంతుజాలము పరస్పర మైత్రీ సహకారములతో మెలఁగుట సర్వసామాన్య విషయము. అట్టి చరితమా శ్రమభూముల మహిమను వెల్లడించును.

నాచనసోమన, శ్రీనాథుడు, పినవీరన, పింగళిసూరన ఇత్యాదుల యందీ వర్ణనము గాంచగలము.

నాచనసోమన :-

పవనవేగవిశీర్ణపాదపాగ్రంబుల, జడియకుండఁగఁబట్టు సామజములు
పూజార్థనియమిత పుష్పవాటికలపై, మధుకరంబులఁ జోపు
మర్కటములు
నవభృథస్నానపర్యంత నిర్మలతకై కాసారముఁ గాచు కాసరములు
నిజకోటజభాగ నీవారసీమలు, సారక గా వలియుండు సూకరములు
గలిగి కంసవైరి కన్నులపండువై, చెలువుమిగిలెఁ బూర్ణకలశ విగళదా
లవాల...*

శ్రీనాథుఁడు :-

కండూయనము సేయుగరఁటి శుండాదండ, పుష్కరమున సింహ
పోతకము
వాలాగ్రసుఖలవదన మించుక యెత్తి, ముద్దాడుఁ బులి లేటిముద్దరాలి
నిండుకౌఁగిటఁ జేర్చి నెమ్మిమైఁ దోఁజేలు, కొదమ చింబోతును గుస్తరించు
గుంజ మంటపకుటి క్రోడమధ్యంబున నాఖులతోఁ జెరలాడు నడవిపిల్లి

* ఉ.హరి - 2ఆ - 109ప.

యెండఁ దాఁకకయుండఁగ నెత్తిపట్టు
బగలు ముంగిటి భుజగంబు పడగ గొడుగు
క్రోతితో మైత్రి పాటించు గోనుదగొఱియ
మార్కండేయుని పుణ్యాశ్రమాంతరమున[1]

వివరణ :-

వృద్ధసింహమునకు విహరింపఁ దొండంబు, కైదండ గానిచ్చు గంధగజము
పులి క్రొత్తయీనిన పొదరింటిలోఁ గిఁబురిటాలి తగఁ బ్రోవఁ గొంపోవు హరిణి
శరభంబు కొనగోళ్ల శిరము దువ్వగ, జొక్కి కనుమోడ్చు సుఖనిద్ర
గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన, వింతలేక చనిచ్చు బాలింతకరిణి

ఎలుకతో దుతఁ జెరలాడు జెనసి పిల్లి,
నెమ్మి పురివిచ్చి నిలిచి పింఛమ్ము నీడ
భుజగకన్యల నాడించుఁ బూరినమలి,
చూడు ఘనకణ్వమునీంద్రు పుణ్యాశ్రమమున.[2]

సూచన :-

ఆ పులినాఁగన్న ఆమోడ్పు పులులును, బులులచేఁ గుడువంగఁబోవు
లేళ్లు
లేళ్ల చెర్లాట రంజిల్లెడు హరులును, హరులు గోళ్లనుగోఁత నలరు
కరులుఁ

1. కాశీఖండ. 2ఆ – 43ప.
2. శృం.నై. 2ఆ – 45ప.

గడులకటాళి వైఖరి నాము పాములుఁ బాముల లాలించు బభ్రుతతులు
బభ్రుతలల ప్రక్కఁ బాయని యెలుకలు, నెలుకలుఁ బెంచు పిల్లులును.

8. రణము :— మన ప్రబంధమున రణవర్ణనము రెండుచోటులఁ గలదు. బ్రహ్మ ప్రస్తుతించినవాఁడు, సోదరులను కోణపవీరులపైఁ దండ్రియాజ్ఞపై దండువెడలి, నారలతోకి యోర్చియార్చుట, కిరాతార్జునులు పోరుట అను తావుల నీ రణవర్ణనము గలదు.

ఉగ్రుని రణము :— ఈ ఘట్టమున పద్యగద్యములు రెండును వీరరౌద్ర రసపూరితములై భయానక బీభత్సాదులుపాంగములుగా నిర్వహింపబడినవి.

గరళంబుద్ధతి నా రగింపఁజను నుగ్రవ్యగ్రవిస్ఫూర్తి సా
గర మూపోశన మెత్తు కుంభజుని రేఖన్, ధ్వాంత సంతాన సు
స్థిరతం దీర్చు దినేంద్రుచందమున, నాసేనం గనుంగొంచు, భీ
కర వేగంబునఁబోఁకి నుగ్రుడుగ్రంబైన రూపంబునన్.[2]

రౌద్రమూర్తియైన యుగ్రుని విజృంభణమిది. రణాంతమున నాహవస్థల మతి భయంకర మై, జుగుప్సావహమై యున్నదానిని కవీంద్రుఁడు గద్యమున వృత్త్యనుప్రాసాద్యలం కారములతో వర్ణించియున్నాఁడు. బీభత్సరసనిర్వహణమున నీ యంశము పరిశీలింప దగినది.

ఇకఁ గిరాతార్జునుల మల్లసంగర సందర్భమున నింకొక రణవర్ణనముగలదు. ఆ వర్ణనము భారతదేశమున నందున ముఖ్యముగాఁ దెలుఁగుదేశమున మనకుఁ బరిచిత మగు మల్లయుద్ధమును కన్నుల గట్టినాఁడు ధూర్జటి. స్వభావసుందరముగ నలరుచున్నట్టి వర్ణనమది.

1. కళా పూ. 3అ - 12ప.
2. శ్రీ.కా.మా. 2అ - 40ప.

"చెయ్యెత్తి యొకకొంతసేపు నేపున బల్మిని మనమునింపఁగఁజాలీరక
మలసి —[1]"

హాస్యములోని యనేకములద్భుతముగ సదృశ్యముగుటతో సర్జునుఁడు గావిం
చిన సాహసమత్యద్భుతము.

అక్షయతూణముఁదునొక యంబకమైనను లేక పోవుచ
ట్లా క్షణమాత్రఁజేయ మదినద్భుతమందియు, నీవుఁడై సహా
స్రాక్షసుతుండు మోఁదె విశిఖాసన యత్తటి నెగ్గఁగించి ఫా
లాక్షుని మౌళిఁ బొటలజటావళి పీకఁగ శేషుఁడాశఁగన్.[2]

9. విజయము :— మన ప్రబంధమున రణమున సాధించిన విజయము సైని
కార్జునిన ఘట్టములందు కొలుకటి వానియందుఁ గవి చేకూర్చియున్నాఁడు.

... ... కోపసాంతుఁడై తీవ్ర
తూలాస్త్రంబున నందఱన్ గడపి శాంతుఁడయ్యె నవ్వీరుఁడున్[3]

అనియను పంక్తికి సుగ్రీవుడు 'పితామహోగ్రధాగంబున నిలిచి గెలిచిన విధంబు విన్నవించె'
అనియుఁ గవి పలికెను. కిరాతార్జునుల యుద్ధమున విజయము పలుకఁబడలేదు. విజయుని
పాశుపతాస్త్రమునొసఁగి మృత్యుంజయుఁడు ప్రత్యక్షమయ్యెను.

10. మృగయావినోదము :— తిన్నని కథయందు మృగయాసము సువ్యమత్తులవేష్టలు
వర్ణించియున్నాఁడు ధూర్జటి కవీశ్వరుఁడు.

'మృగయార్థదైవత యాత్రయొనర్చి బోనము చేసి శబర దంపతులు
రతుల'[4]

1. శ్రీ.కా.మా. 4ఆ — 191ప.
2. ,, 4ఆ — 187ప.
3. ,, 2ఆ — 61ప.
4. ,, 3ఆ — 41ప.

ఇది హాస్యరసాలవాలమై యొప్పుచున్నది 'మాటలాడఁదలంచి మఱచిపోయెడువారు, నడువఁబోవుచు నిద్రపోయెడువారు ..[1] ఇవ్విధంబున మధుర మధుర సాస్వాదనామోద మేదుర వినోదంబుఁ గేలి సలిపినారు కవులు.

మధుపానమత్తుల నాటిచేష్టలు వర్ణించునప్పుడు చక్కని స్థితిదృశ్యము నందించిన వాఁడు హరిభట్టు

'తతతతామరసాక్షి తలపంతమాడకు, విివివిపీనాకంఠవీణఁదెమ్ము
పపపపాటలగంధి పాటపాడుమికంత, కుకుకు కుందస్మితకురులు
ముడువు...[2]

**11.** వనవిహారము :- పార్వతీపరమేశ్వరుల వనవిహారవర్ణనమిందుగాంచ నగును. 'మంచుగుబ్బలి రాజకుమారిఁగూడి, వేలుపులపెద్ద జముదెస వెండికొండ'దరిని బహువేషధారి యగుచు త్రిమ్మరుచుండునట.

'శిష్టనీవారముష్టింపచాశ్రమముల, వెలఁగు సంయమిగృహమేధి
యగుచు
గాంతార మధ్య పక్కణ విహారంబులఁజలపు గిరాత సంసారి యగుచు
సంతతాంతర్యాగ సాధకస్థలముల, నలరారు సిద్ధ గృహస్థుడగుచు
లలితచతుర్విధాలంకారములఁదాల్చి, నవభోగ రతిగృహనాథుఁడగుచు
మంచుగుబ్బలిరాజకుమారిఁగూడి, వేలుపుపెద్ద జముదెస వెండికొండ
దన్నుఁదెలిసినవారికి నన్నిదెసలఁ దానయగు రీతి బహువేషధారి
యగుచు'[3]

---

1. శ్రీ.కా.మా. 2ఆ - 41ప.
2. నా పు. 2ఆ - 158ప.
3. శ్రీ.కా.మా. 1ఆ 101ప.

ఈ విహారసఘట్టవర్ణనముసంగవి పరమేశ్వరునిపార్వతీసహితునిగా వర్ణించుచు పురాణ దంపతుల ఆదర్శదాంపత్యమును, ఎడమెఱుగని జంటగా నుండుటను పల్కినట్లయినది కొలుతనే మనము భావించియున్నారము, ధూర్జటి 'తుషారశైలతనయాదాంపత్య సంపన్న పావనగార్హస్థ్యము'నే వర్ణించుట నీ పద్యము రూఢియొనర్చుచున్నది. వన విహారమును వర్ణించిన కవులనేకులుగలరు. వారెల్లరు నాయికానాయకుల శృంగార విలాసములు, నాయిక చెలులతోగూడ పుష్పాపచయముచేయుటలు వృక్షములకు దోహద క్రియలొనర్చుటలు వర్ణించియున్నారు. తిక్కన నిర్వచనోత్తర రామాయణము, నాచన సోమన ఉత్తరహరివంశము, రామభద్రకవి రామాభ్యుదయము, నృసింహకవి కవికర్ణ రసాయనము, భట్టుమూర్తి వసుచరిత్రము, సూరన కళాపూర్ణోదయము, అన్నయ సుదక్షిణాపరిణయము, తెలగన్న యయాతిచరిత్రము, ధర్మయామాత్యుని నలచరిత్రము, పైడిమర్రి వేంకటపతి చంద్రాంగద చరిత్రము, లింగనకవి ఉత్తర హరిశ్చంద్రో పాఖ్యానము, అక్కినేపల్లి నృసింహకవి ఓషువతీ పరిణయము, చళ్ళపిళ్ళ నరసకవి యామినీ పూర్ణతిలకావిలాసము, ఘట్టు వేంకటరామకృష్ణకవి పట్టాభిరామాయణము, నారపరాజు కాంతకవి కవిజనచకోర చంద్రోదయము, కందుకూరి వీరేశలింగకవి రసిక జనమనోరంజనము, కొంతి వత్స్రాద్రిరామశాస్త్రి శంతనూపాఖ్యానములను కావ్యములందు వన విహారము వర్ణింపబడినది.

12. కన్యాంగ సౌందర్యము :- వేశ్యాతనయల కథయందు కన్యాంగసౌందర్యము వర్ణింపబడినది. సర్వసాధారణముగా కన్యాంగసౌందర్యవర్ణనముగ వించుచీతినిగాక, ధూర్జటి వేశ్యాతనయల శైశవమును వీడు సంధిసమయము శివభక్తియుతులగువారి శాశ్వత పరిణామమును శాంభవలేఖోల్లేఖముగ గావించినాడు.

శివపూజనాసక్తిం జిన్నిచన్నుల పెక్కు, వయుఁబ్రత్యహంబును నయముఁ
జూప

శైవాగమాంతర జ్ఞానంబుఁదనులతా, ప్రభయు నంతంతకు నభినవముఁగఁ

బార్వతీవ్రత శేశభక్తియు, గూళట్లు నెలసి నానాటికి వృద్ధిఁబొంద

వారకులాచార వాసనాబాల్యంబు, లోకపూట కొకపూట కుడిగిపోవ

> శాంభవంబైన తేజంబు శైశవాప, గమవయోగణ్యలావణ్య గౌరవంబు
> హృదయము న, నంగకంబుల నుదయమొదవఁ జదువఁబోవుదు రిరువురు
> మదవతులును.[1]

మానసికము, శారీరకములగు పరిణామములు రెండు నొక్కక్రమమున సంభవించినవనుట యీ వర్ణనము. 'హృదయము నంగకంబుల' శాంభవంబైన తేజంబు శైశవాపగను వయోగణ్యలావణ్య గౌరవంబు నుదయమొందినవి. శాంభవంబగు తేజంబు రూపుగొనుటకు తొలుత శివపూజనాసక్తి కలుగుట, అది క్రమముగా శైవాగమాంతర జ్ఞానముగా పరిణామమందుట, పార్వతీ ప్రాణేశభక్తి వృద్ధిఁబొందుట జరుగగా వారకులాచారవాసన వదలిపోయినది. అట్టులే యవ్వనమున కారంభచిహ్నములవలె చిన్నచన్నులగపడుట, తనులతాప్రభ యభినవముగ పెంపొందుట, ముచ్చటగా కూకట్లు వృద్ధిపొందుట, బాల్యముడుగుటలు వయోగణ్యలావణ్య గౌరవ ముదయమందుటకు దారకాణలు.

**13. చంద్రోదయము** :— చంద్రోదయమునకు మున్ను తారకలు పొల్చుటను శివకేశవుల కభేదముగను, చంద్రబింబమును శివలింగముతో నభేదముగను వర్ణించుట, మన ప్రబంధమందలి చంద్రవర్ణనమునకుగల విశిష్టత. ఇచ్చటి చంద్రోదయము శృంగారరసప్రాధాన్యముగల యితివృత్తమున, ఘట్టమునకు చెందినదికాదు. శివార్చనాపరము లగుకాళహస్తుల పోరాటమునకు మున్ను రాత్రియగుటచే చంద్రుఁడు శివుఁడైనాఁడు. చంద్రుడును శివుఁడును సోములేకదా!

> ఉదయగ్రావము పానవట్ట మభిషేకోదప్రవాహంబు వా
> ర్ధి, దరీధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీపప్రభారాజి కౌ
> ముది, తారానివహంబు లర్పితసుమంబుల్గా, దమోదూరసా
> ఖ్యదమై శీతగభస్తిబింబ శివలింగంబొప్పెఁ బ్రాచీదిశన్.[2]

చంద్రునుదయమున కాలవాలమైన తూర్పుకొండ, తూర్పుసంద్రము, అలముకొన్న చీకటి, వెన్నెల, నక్షత్రములు, శివలింగమునకు పానవట్టముగా, అభిషేకజలముగా

1. శ్రీ.కా.మా. 4ఆ – 23ప
2. ,, 2ఆ – 138ప

ధూపముగా, దీపకాంతిగా, పూజాపుష్పములుగా రూపొందినవి. ఇరువురును తమోహరసౌఖ్యకారకులే.

ఇట్టి వర్ణనలు ఇక్కాలి తర్వాత శ్రీనాథుని భీమఖండమున చంద్రవర్ణనమున జూడగలము.

కాదు కాదుదయాద్రి కనకకూటంబిది, డంబైన పానవట్టంబుగాని
కాదు కాదిది సుధాకరపూర్ణబింబంబు కాశ్మీర శంభులింగంబుగాని
కాదు కాదుదయరాగప్రకాశంబిది నవకుంకుమాలేపనంబుగాని
కాదు కాదిది కళంకచ్ఛటారింఛోళి పూజచేసినకల్వపువ్వుగాని
యనఁగ సప్తార్ణవములు మిన్నందికొనఁగ, జంద్రకాంతోపలంబులు జాలువాఱ
నసమశర సార్వభౌము ముత్యాలగొడుగు, విధుఁడు విశ్వంబు వెన్నెల వెల్లి దేల్చె.*

ధూర్జటి కవీంద్రుఁడు చంద్రవర్ణన గావించిన వేరొకతావునను, నిట్టి శివ పారమ్యమునే ప్రకటించెను. వేశ్యాతనయలు శ్రీకాళహస్తికిఁ బయనము సాగించుటలో గడచిన రాత్రివర్ణనమిది. ఇచ్చట చంద్రుఁడు భూతేశునితోఁ బోల్పబడెను. తరువాత సూర్యాస్తమయము చంద్రోదయములు రెండునొకేసారి జరిగినట్లు వర్ణింపబడెను. మఱల చంద్రుని యుదాత్తత కొనియాడఁబడెను.

వామాంగభామినీశ్యామ భామాళియు, గంఠహాలాహలకాళిమంబు
నాకాశకేశపాశాసితచ్ఛాయయుఁ జూళికాసింధుశైవాలరుచియుఁ
గరకృష్ణసారాక్షిఘనధూమనీలిమ, శేషభూషణ ఫణాసీమ నలుపుఁ
గటితటకీలిత కరటిచర్మద్యుతి, మేచక శూల శోభాచయంబు,

* భీ.పు 2ఆ - 41ప

భువనలోచను పైనెత్తిపోవు నంధ కారబృందమునకుఁ దోడుగాఁగ గూర్చి
వెనుక నేతెంచు భూతేశువిభవము దనర, జంద్రుఁ డుదయాద్రిపై నొప్పె
సాంద్రకాంతి.[1]

ఇందు చంద్రుఁడు శివునితోఁ బోల్పఁబడుటఁ గాంచితిమి. అయిన, పద్యవర్ణనమంతయు శివరూపచిత్రణమే. నల్లరూపు కలిగిన విశేషణములన్నియు శివునియలంకారములే. కాని శివుఁడు తెల్లనివాఁడే. శివునివంటి తెల్లనివాఁడే చంద్రుఁడును కాన శివుని నీలిమ విశిష్టము లగు నాభరణములన్నియు చీఁకటితోఁ బోల్చి, యావెనుక చంద్రుని పలుకుట యిందలి చమత్కారము.

సూర్యాస్తమయము, చంద్రోదయము నొకేమారు జరిగినవను నంశము స్ఫురించునట్లు ఒకే పద్యమున కవి యాఱెంటినిఁ గూర్చెను.

**తిమిర దిశేంద్రజా జలము దెచ్చి, యజాండఘటంబునందుఁ బో
సి, మరలఁ బశ్చిమాశయను చెల్వ వహించిన పద్మరాగ కుం
భము గతి సూర్యుఁడుం జనియెఁ బ్రాక్సతి వెన్నెలవెల్లుటేటితో
యమున వడిఁ బోయు హేమకలశాకృతిఁ జంద్రుఁడు నొప్పె నయ్యెడన్[2]**

పడమటిదిక్కున అస్తమించుచున్న సూర్యుఁడును, తూర్పున నుదయించుచున్న చంద్రుడు నొకే సమయమున నుండుటయిది. అస్తమించుచున్న సూర్యుఁడు పద్మరాగకుంభమువలె, ఉదయించుచున్న చంద్రుఁడు బంగారుకుండవలె నుండుట సహజమగు వర్ణనము. చీఁకటియను యమునను క్రుమ్మరించిపోయినాఁడు సూర్యుఁడు. వెన్నెల యను ఆకాశ గంగాజలమును తెచ్చునట్టివాఁడు చంద్రుఁడు.

గగనాహార్యమృగేంద్రశాబకము, నక్షత్రాంబుజారణ్యమ
ధ్యగహంసంబు, నిశావధూకరతలోద్యన్మల్లికాగుచ్ఛ, మ
ధ్వగబాధావహ చిత్తభూకటకయాత్రావహ్నికచ్ఛత్ర, మొ
ప్పుగతిం జంద్రుఁడు దోఁచె, దంపతుల కింపుల్మీఱఁగా దొద్దెసన్[3]

1. శ్రీ.కా.మా. 4ఆ – 90ప.
2. ,, 4ఆ – 91ప
3. ,, 2ఆ – 134ప

చంద్రుని స్వరూపస్వభావము లిందు ల్లేఖింపఁబడెను చంద్రుఁడమృతకలశముగా నుత్ప్రేక్షింపఁబడినాఁడు. తరువాతి పద్యమున

గరుడానీత సుధాఘటంబుగొనిపోగా నిర్జర శ్రేణి వెం
ట రయంబారఁగఁ బాఱు నాగముల చూడారత్న సందోహ మం
బరవీథిం బరగింపఁ జంద్రుఁడుదయింపం దోఁచె దోస్తో నుదా
త్కరముం జిందమృతంబు బిందువుల శంకం గ్రమ్మఁగం జేయు చున్,[1]

గరుడునిచే గొనిపోబడిన యమృతభాండమువలె చంద్రుఁడున్నాఁడట యని. దాని నుండి రాలుచున్న యమృతపు బిందువులుగా చుక్కలు వెలుగొందుచుండెనట. ఇట్టిదే వేశ్యాతనయల కథయందొకటి కననగును.

కాముకహృద్దధింగలఁచు కవ్వము, బువ్వము దేవకోటికిన్
వ్యోమపథంబు తేనె పెరగొప్పెడు పర్వము, నవ్వుముత్పల
శ్రీమతికిన్, జకోరమహిమధు వనీకి గ్రోచునన్న మై
యామవతీశబింబ ముదయాచల మెక్కె బ్రభాళి పెక్కవన్.[2]

ఇట్టిమూర్తి హరిశ్చంద్రనలో పాఖ్యానమున నీనికి సౌందర్యము దాల్చు వర్ణనయొకటి కనబడును.

కళలకు నిమ్ము, సోమ్ము సెగకంటికి, మింటికిఁ జెన్ను, వెన్నతో
య్యాలి సయిదోడు, కూడు దివిజాళికి హేళికి జంట, తుంటవిల్
గలదొరవిందు, పొందువిరిగల్వకుఁ, జల్వకునిక్క, రిక్కరే
వెలందుల, నీవిబాళితుచిపిచికిఁ, బ్రాచికినచ్చెఁ జెచ్చెరన్,[3]

---

1. శ్రీ.కా.మా. 2ఆ – 135ప
2. ,, 2ఆ – 92ప
3. హరి.నలో. 4ఆ – 16ప

చుక్కలతేఁడు, చీఁకటి సూడు వెలుంగుల జేనిజోడు బల్
జక్కవపుల్గు మొత్తముల సారెకు నేఁచెడు వాఁడు చక్కనౌ
మిక్కిలి కంటి దేవరకు మేల్నగరై తగువాఁడు కల్వలన్
మక్కువఁ బ్రోచుతేఁడు మరుమామ కనంబడె దూర్పుకొండపై[1]

14. సూర్యోదయము :- మన ప్రబంధమున ఏ సూర్యోదయ వర్ణనము రెండు చోట్లనున్నది. సామునేనుఁగుల పోరు కథయందును, వేశ్యాతనయుల కథయందునుఁ గలదు. సామునేనుఁగుల కథయందు సూర్యోదయ వర్ణనము సందర్భోచితమై, సాభిప్రాయమై యలరుచున్నది.

పన్నగంబు, గజంబు. బలమునఁ జలమున, బోరుటెట్లో? శివ్రసిబొందు
టెట్లో ?
చూడఁ గలయు' ననుచు వేడుకతో వచ్చు, కరణి, నంతఁ దోఁచెఁ గర్మ
సాక్షి.[2]

ఇందలి 'కర్మసాక్షి' యను సూర్యునకుపయుక్తమైన విశేషణము సాభిప్రాయము. ప్రపంచమున సర్వజీవుల సర్వకార్యములకు సాక్షిభూతుఁడుకాన సూర్యుఁడు నాఁటి సామునేనుఁగుల పోరు జరుగు తీరు, పరమేశు పొందురీతి చూడవలయునని ఉదయించె ననుట కవి ప్రతిభకు నిదర్శనము. ఇట సూర్యోదయవర్ణనము దీర్ఘముగా సాగకుండుట యెంతయు సముచితముగా నున్నది. సామునేనుఁగులు రెండును క్రిందటి రాత్రి మిక్కిలిగా బాధపడి, 'యెప్పుడు తెల్లవాఱును? సహింపగరాని విరోధివహ్ని నేఁడొప్పున నార్తుమొక్కో? యనుచు,[3] వేఁగించినవికాన, సూర్యుఁడును వేగముగా నేఁగుదెంచెననుటకు సూచనగ కవి ధూర్జటి యిచ్చట సూర్యోదయమును ఒక్కగీతములో, వేగసూచకము లయిన చిన్నచిన్నపదముల ప్రయోగమున వర్ణించుట కవీంద్రుని యౌచితీపాలనమును, కథననైపుణిని వ్యక్తము సేయును.

---

1. ర.జ.మ. 4ఆ - 9ప
2. శ్రీ.కా.మా. 2ఆ - 139ప.
3. శ్రీ.కా.మా. 2ఆ - 137ప.

వేశ్యాతనయలకథయందు సూర్యోదయ మొకవృత్తమునఁగలదు. చంద్రు నుల్లేఖించినట్లే, కవి సూర్యునిగూడ నుల్లేఖించెను.

చీఁకటికానచిచ్చు, భవచేలకుసుంభము, తూర్పుకొండకున్
గూఁకటిరత్న మంబరమునూరిమింపంట, చకోరరాజి పే
రాఁకటిమంట, శోణకిరణావళి గంట, రథాంగకేళికిం
దేఁకువపెంట, మింటజనుదెంచె దినేంద్రుఁడు కాలఘంటయై[1].

ఈ పద్యమున సూర్యుని వర్ణించుటయందు మొదటి విశేషణము, తుదివిశేషణమును స్వరూపస్వభావవ్యంజక సమర్థములై యొప్పుచున్నవి. చీఁకటిఁద్రోచి లోకమునకు సర్వజంతుజీవరక్షా సమర్థమైన వెలుఁగునిచ్చుట దినేంద్రుని ధర్మముగను భాస్కరుఁడు కాలస్వరూపుఁడను నంశమును 'కాలఘంటయై' యను విశేషణముచే తెలిపినట్లయినది. ఈ రెండు విశేషణముల నడుమగల విశేషణములన్నియు ప్రబంధసామాన్యములే. ఈ రెండు నట్టివేయయినను ఆరెండింటినే మొదలను తుదనుంచుటయే యిందలి విశేషము రూపకోల్లేఖాలంకారములచే నీవర్ణన మలంకరింపఁబడినది.

**15.** సురతము : దాసీ-మిండజంగముల కథయందును, వాణీశరానందుల కథయందును సురతవర్ణనము జరిగినది.

తానుఁ గుమారజంగము సుధాకరిమాళియుఁ గూడిమాడి యిం
పైన రతి ప్రసంగములు, నర్థనిమీలితనేత్రపద్మముల్
మానని చుంబనంబులును మాటలచొక్కులు, వీడివీడిపో
సేని కౌఁగిలింతలు, ననేకవిలాసములుం జెలంగఁగన్.[2]

---

1. శ్రీ.కా.మా. 4ఆ - 97ప.

2. శ్రీ.కా.మా. 1ఆ - 42ప.

ఎక్కడఁజిక్కెనం గళలయిక్కువ లెక్కడ నోరుసోఁకినన్
జక్కెరలప్పు లేమనిన సారసుధారస మెట్టులుండినన్
జక్కదనంబు పెన్నిధులు, సంభ్రమ మొప్పఁగ నేమిసేసినన్
మక్కువ చెయ్వులై మెఱయు మన్మథకేళి రెయొనర్చునంతటన్. 1

దాసీ-మిండజంగముల కలయికయగుటచే సిందలి వర్ణనము శృంగారము రసస్థితి చేరి నట్లు వర్ణింపఁబడినది. ఆ దాసి 'పురవల్లవప్రకర నేత్రానందబాష్పాంబుధారావర్షాగమ చంచలాలతిక'2, అతండును 'సౌందర్యము చూచి కామశరసంతాపంబునుం బొంద కుండిన కాంతామణి'3 లేని సుందరుఁడు. వారిడువురును కూడిమాడి, యనేకవిలాసములం దెలంగుటకు ఇంపైన రతిప్రసంగములు ప్రారంభముకాగా, వీడిపోడిపోసిని కౌఁగిలింతలు ఫలితాంశము. వారి సర్వచర్యలును మన్మథకేళికి దోహదకాదులే యయినవి. వారి యప్పటి మనఃస్థితి నందించునది రెండవ పద్యము.

తననతిమొదల వాంఛాచాపల్యము తీఱకపోవుటచే వాఁడవల్లభుఁడు, తనకోరిక నీడేరుట కామెను శరవాగ్వనజానన కావలయునని కోరుటతో నిచ్చటి ప్రసంగము ప్రారంభమైనది. శతానందుఁడను పేరు బ్రహ్మకు కలుగుటకీపద్య కారణమైనది.

అందున కెంతయుం బ్రమదమందుచుఁ బుష్పిత వల్లులందు నిం
దిందిరశాబకంబు పువుఁదేనియ గ్రోలెడిరీతి నూర్వరం
బొంది, సుధాధరగ్రహణ భూరిసుఖంబుల నొందుచున్నతా
నందుఁడనంగ నొప్పెసఁగె నాఁడు మొదల్కఁ ఫలన్విధాతయున్.4

---

1. శ్రీ.కా.మా. 1ఆ 43ప.
2. ,, 1ఆ 33ప
3. ,, 1ఆ 32ప
4. ,, 2ఆ 16ప

